శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల
హిందూపురము. పుష్పము ౨౨.

శ్రీ

# రాయలసీమ రచయితల చరిత్ర -౧-

20వ శతాబ్దపు రాయలసీమ కవిరత్నముల చరిత్రలను వారి కవితలతో, చిత్రపటములతో ఏర్చికూర్చి తీర్చిన గ్రంథరాజమిది. తెనుగు తల్లి ధరించే అమూల్య భూషణాలలో ఇదొకటి.

గ్రంథకర్త
కవిభూషణ, కవితిలక, కల్లూరు అహోబలరావు.

ప్రథమ ముద్రణము—1975 జూలై
1000 ప్రతులు.

కం. జిలిబిలి పలుకుల, బలు ము
ద్దులు గులుకు, తెలుగుదానతో, సరియగునే?
తెలిసియు తెలియక వీనుల
నలరించెడు, వెట్టిమొట్టి-యటిముటి దాసర్.

వెల రూ. 8–00

ప్రతులకు.

శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల
హిందూపురం. ఆంధ్ర

ముద్రణ : సెలెక్టెడ్ పవర్ ప్రింటర్స్, హిందూపురం.

# కృతజ్ఞత

34435

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ – హైదరాబాదు వారు మేముపంపిన 'రాయలసీమ రచయితల చరిత్ర' వ్రాతప్రతిని పరిశీలించి, అచిరకాలమునందే ఈ పుస్తక ముద్రణము కొరకు

**రూ 1500-00 లను**

గ్రాంటుగా విడుదలచేసి, పుస్తక ముద్రణకును సహాయపడిరి. వారికి మా మనఃపూర్వక కృతజ్ఞతాభివందనములు సమర్పించుచున్నాము. ఇట్లే వారెల్ల వేళలందు రాయలసీమ రచయితలను ఆదరించవలెనని మా ప్రార్థన.

తా॥ 15–6–75 ఇట్లు.

హిందూపురం. కల్లూరు అహోబలరావు

మేనేజింగ్ ఎడిటర్, శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల.

అలనాటి ఆంధ్రభోజుడు—కళాపోషకుడు—మూరురాయరగండడు శ్రీకృష్ణదేవరాయలు



రాయలసీమ కవులపాలిటి కల్పతరువు.
జననము:— క్రీ.శ 1489వ ప్రాంత్యము—నిర్యాణం:— క్రీ. శ 1529వ ప్రాంత్యము
ఇరవై సంవత్సరాలు ఏకచ్ఛత్రాధిపతిగా విజయనగర సామ్రాజ్యమేలిన
మూరురాయరగండడు.

# కృష్ణరాయలు

" స్వర్ణకంకణ విభూషిత "
కవిసుధాకర & గాయకరత్న
యన్. రాజన్నకవి

34435

పదునౌ ఖడ్గముఁబూని రక్తఝురులన్ పారించి, సామ్రాజ్యసం
పదలన్ గైకొని సార్వభౌమ పదవిన్ భాసించినావటులే
మృదువౌ గంటముఁబూని ముగ్ధకవితాహేవాకమాధ్వీక సం
పదలన్ నింపి కవీంద్ర పీఠిగొనినావా ! కృష్ణధాత్రీశ్వరా!

కమ్మని తేనెలన్ జిలుకు
కైతలు, వీనుల విందుఁగూర్చు గా
నమ్ములు, నేత్రపర్వమగు
నవ్యమనోహర ముగ్ధ శిల్పజా
లమ్ములు. భామినీ మధుర
లాస్య విలాస విభాసమాన నా
ట్యమ్ములు నిండిపోయినవి
రా! యొకనాఁడు తెలుంగు గడ్డపై.

' భువన విజయము ' సుధోపమ
కవన నిలయమై, కవీంద్ర కల్పాశ్రయమై
వివిధ కవిత్వసుగంధ
స్రవంతికలు నింపెఁదెల్గు రాజ్యమునంతన్.

రాయలసీమ 'శివభారత' కర్తకు గండపెండేరము దొడిగిన అపర
శ్రీ కృష్ణదేవరాయలు—పద్మశ్రీకల్లూరు సుబ్బరావుగారు.



జననము ;— 1896 — నిర్యాణం : 1973 డిశంబరు 20వ తేది.
ల్లి : శ్రీమతి షట్టమ్మ — తండ్రి : శ్రీ కరణం సూరప్ప
మతము—కులము:— హిందూ—స్మార్త బ్రాహ్మణ—విశ్వామిత్రగోత్రము.

## పద్మశ్రీ కల్లూరు సుబ్బరావుగారు 26-3-1972 వ తేది " ఉగాది స్వర్ణభారతి " కృతి స్వీకరణ సందర్భమున కృతికర్త శ్రీ కల్లూరు అహోబలరావు గారికి అందజేసిన శుభాశీస్సులు.

" శ్రీ కల్లూరుఅహోబలరావు నాకు మేనల్లుఁడు. చిన్ననాటినుండి నాయెడ భక్తిగౌరవములుకలవాడు. నావలెనే, ఇతడును జాతీయోద్యమమును మనసార ప్రేమించినవాఁడు. ఇతనికి, పూర్వపుణ్యవశమున కవిత్వమలవడినది. అది దేశభక్తిప్రపూరితమై చతురస్రశోభిగా వికసించి పరిమళించినది. ఇతఁడు తనదేశభక్తిని కవితారూపమున వెలుగెత్తి ఆలపించినాడు. నేటికిని ఆలపించుచున్నాడు.

మనసీమలో వాసిగాంచిన శ్రీ కృష్ణదేవరాయగ్రంథమాలకితఁడు వ్యవస్థాపకుడు. పై సంస్థ, ఆంధ్రసారస్వతమునకు చేసిన సేవయింతింతనరానిది. ఈసంస్థనింతగొప్పగా నిర్వహించుటలో, ఇతడుచూపుచున్న శ్రద్ధ సామాన్యమైనదికాదు. అందతని కార్యశూరతయు దొడ్డది.

అన్నిటికంటె శ్రీ అహోబలరావులో, పనులయెడ పట్టుదల యధికము. తానెప్పుడో చిన్ననాట మొదలుపెట్టిన ఉగాదిశుభాకాంక్షలు, ఒక్కఏడాదియైనను విడునక, ఏబది ఏండ్లు నిర్వహించినాడు. నా దృష్టిలో నిది చాలా గొప్ప విషయము.

నేడితఁడు వెలయించిన, ఈ " ఉగాది స్వర్ణభారతి " ఇతఁడేబది యేండ్లుగా కన్నుమలపక, పరామర్శించిన జాతీయోద్యమ సంఘటనల సంపుటి. తన బంధు మిత్రులకితఁడు మనసువిప్పిచెప్పిన ఉపదేశములకూర్పు. తాను వారికి చేయెత్తి యిడిన దీవనల మాలిక.

ఇతఁడు తన ఈ కృతిని, నాకంకితము చేయమనసుపడుట నాకెంతయు ముదావహము. కవులదృష్టిలో కావ్యమొక కన్యక. దానివితఁడు నాకొసఁగి విచ్చగించినాడు. డెబ్బదియారేండ్లు వయస్సుపండిన నేను ఇతని చూపులో పెండ్లికొడుకుగ గాన వచ్చితిని. నాపై యితని స్నిగ్ధభావనిష్పందత యింతగాఢమైనది. నేటి ఈకృతి సమర్పణము నాపై నితనికిగల స్నేహ బంధమునకు నిబంధనము. ఇప్పటి నా ఆనందమునకు మేరలులేవు. ప్రేమ నిర్భరమైన హృదయముతో, శ్రీ అహోబలరావు నాశీర్వదించుచున్నాను. ఇతఁడు చిరాయురారోగ్యోన్నతుల వర్ధిల్లుగాక!

మా ఇరువురి భావబంధమునకు కుసుమముగా నీ " స్వర్ణభారతి " అనంతకాలము పరిమళించుగాక.

| | |
|---|---|
| హిందూపురము. | ఇట్లు దీవించు |
| తేది. 26—3—1972 | కల్లూరు సుబ్బరావు. |

కవిభూషణ, కవితిలక శ్రీ కల్లూరు అహోబలరావు



శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల

వ్యవస్థాపకులు

గ్రంథమాల త్రైవార్షికోత్సవ చిత్రము, బళ్ళారి. సం॥ 1933



శ్రీ దివాన్ బసప్ప, శ్రీ రంగబ్రహ్మమునాయుడు, బెల్లోణ బాలాజీరావు మొ॥ వారున్నారు.

# శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల సంగ్రహ చరిత్ర

ఇయ్యది, 1931 లో బళ్లారి పట్టణమున కవిత్రయముచే 1) శ్రీ మురళీ కృష్ణమూర్తి 2) శ్రీ దేవదానము 3) శ్రీకల్లూరు అహోబలరావు గారిచే స్థాపింపబడెను. రాయలసీమ కవిపండితుల గ్రంథములను ప్రచురించి, వాటిని వెలుగులోనికి దెచ్చుటయే దీని ప్రధానోద్దేశ్యము. ఈ సంస్థ స్వలాభాపేక్షతో నెలకొల్పబడలేదు.

బళ్లారి పట్టణమున, శ్రీ విఠాలు శేషప్పగారు, తహశీలుదారు శ్రీ పిళ్లారిశెట్టి రంగబ్రహ్మము నాయుడుగారు, మునిసిపలు ఛేరుమెన్ సి. బాలాజీరావుగారు, శ్రీ టి. శంకరలింగం పిళ్ళెగారు, శ్రీ బెలోణ భీమరావుగారు, శ్రీ యం. దేవేంద్రం నాయుడు గారు శ్రీ వేదగిరి శెట్టిగారు, శ్రీ దివాకా బసప్ప గారు. శ్రీ చెరుకూరు భీమప్పగారు మొదలైన పురప్రముఖులీ గ్రంథమాలకు ఆర్ధిక సహాయమొసంగి ప్రోత్సహించిరి.

అప్పట్లో, గ్రంథమాల సంవత్సరమునకు మూడు పుస్తకములను ప్రకటించి, ఒకరూపాయ చందాకే అపుస్తకముల నిచ్చుచుండెడిది. 1933 వ నాటికి, 9 పుస్తకములు ప్రచురింప బడెను.

16—9—1933 వ తేదీన గ్రంథమాల త్రైవార్షికోత్సవము, పేర్కొన్న బళ్లారి పుర ప్రముఖుల సాయముచే మహావైభవముగా నిర్వహింపబడెను. ఇందు ఆనాటి చిత్రము ప్రకటింపబడినది.

శ్రీ గాడిచెర్ల, హరిసర్వోత్తమరావుగారు ప్రధానోపన్యాస మొసగిరి, శ్రీపప్పూరు, రామాచార్యులు, శ్రీ కల్లూరు సుబ్బరావు, శ్రీ వార్తకవి రామచంద్రరావు గారు, గ్రంథ భాండాగారములు గ్రంథమాలలు భాషాసేవనెట్లు సేయవలయునను, విషయములపై మాట్లాడిరి.

రెండవదశ :—

1934 లో ఉద్యోగరీత్యా, శ్రీ కల్లూరు అహోబలరావు బళ్ళారివిడిచి అనంతపురముజేరిరి, గ్రంథమాల అనంతపురమునకు తరలింపబడెను. కార్యదర్శిగాయున్న శ్రీ హెచ్, దేవదానముగారు తెలుగు పండితులుగా, కడప జిల్లాకు వెళ్ళిపోయిరి. శ్రీ కల్లూరు అహోబలరావు కల్యాణదుర్గము తాల్లూకా పల్లెలలో, ప్రాథమిక పాఠశాలలలో, ప్రధానోపాధ్యాయులుగా పనిచేయుచుండుటచేతను, ప్రెస్సు సౌకర్యములు లేనిదాని వల్లను, గ్రంథమాలా ప్రచుర ణములాగి పోయెను. కాని ప్రతి సంవత్సరము ఉగాది కానుకలు గ్రంథమాల అనుబంధ ప్రచురణములుగా వెలువడుచుండెను. 1949 లో బాపూజీ మరణానంతరము 'కన్నీటి కాలువ' వెలువడెను.

1951 లో, రావుగారనంతపుర పట్టణముజేరిరి. 1953 వఱకు 3 పుస్తకములను మాత్రము ప్రకటించిరి. గ్రంథమాలకు మూల ధనములేదు, ఎప్పటికప్పుడా సంవత్సరము వసూలైన, విరాళ చందా మొత్తములతో, పుస్తక ముద్రణము సాగిపోవుచుండెను. రానురాను కాలము మరింత గడ్డుగా మారుట, కష్టములు తామర తంపరగా వ్యాపించుట, చందా వసూళ్ళు నిలిచి పోవుట జరిగినవి

# శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల సంగ్రహ చరిత్ర

ఇయ్యది, 1931 లో బళ్లారి పట్టణమున కవిత్రయముచే 1) శ్రీ జూశీ కృష్ణమూర్తి 2) శ్రీ దేవదానము 3) శ్రీకల్లూరు అహోబలరావు గారిచే స్థాపింపబడెను. రాయలసీమ కవిపండితుల గ్రంథములను ప్రచురించి, వాటిని వెలుగులోనికి దెచ్చుటయే దీని ప్రధానోద్దేశ్యము. ఈ సంస్థ స్వలాభాపేక్షతో నెలకొల్పబడలేదు.

బళ్లారి పట్టణమున, శ్రీ విఠ్ఠాలు శేషప్పగారు, తహసీలుదారు శ్రీ పిళ్లారిశెట్టి రంగబ్రహ్మము నాయుడుగారు, మునిసిపలు ఛేరుమెన్ సి. బాలాజీరావుగారు, శ్రీ టి. శంకరలింగం పిళ్ళెగారు, శ్రీ బెలోణ భీమరావుగారు, శ్రీ యం. దేవేంద్రం నాయుడు గారు శ్రీ వేదగిరి శెట్టిగారు, శ్రీ దివాన్ బసప్ప గారు. శ్రీ చెరుకూరు భీమప్పగారు మొదలైన పురప్రముఖులీ గ్రంథమాలకు ఆర్ధిక సహాయమొసంగి ప్రోత్సహించిరి.

అప్పట్లో, గ్రంథమాల సంవత్సరమునకు మూడు పుస్తకములను ప్రకటించి, ఒకరూపాయ చందాకే ఆపుస్తకముల నిచ్చుచుండెడిది. 1933 వ నాటికి, 9 పుస్తకములు ప్రచురింప బడెను.

16—9—1933 వ తేదీన గ్రంథమాల త్రైవార్షికోత్సవము, పేర్కొన్న బళ్లారి పుర ప్రముఖుల సాయముచే మహావైభవముగా నిర్వహింపబడెను. ఇందు ఆనాటి చిత్రము ప్రకటింప బడినది.

ప్రకారముగా గ్రంథమాల బహుళ వ్యాప్తిఁజెందెను.

శ్రీ రావుగారిచే వ్రాయబడిన 'ఉగాదిస్వర్ణభారతి' ఆవిష్కరణ మహోత్సవము 26—3—72 వ తేదీన హిందూపురము వాసవీ ధర్మశాల యందు శ్రీ కట్టాలక్ష్మీనారాయణయ్య గారి అధ్యక్షత క్రింద జరిగెను. ఈ సభలో 'స్వర్ణభారతి' గ్రంథకర్తగారిచే శ్రీ కల్లూరు సుబ్బరావుగారి కంకిత మొసగబడెను. శ్రీ కట్టాసుబ్రహ్మణ్యముగారు, శ్రీ చౌళూరు రామరావుగారు, సభలోఉపన్యసించిరి, శ్రీకల్లూరు సుబ్బరావుగారు గ్రంథకర్తగారికి శుభాశీస్సులందజేసిరి. (అవి, ఈపుస్తకములోప్రకటింపబడినవి.) పురప్రముఖులనేకులేతెంచి, సభను జయప్రదము గావించిరి. 1975లో, రాయలసీమ, రచయితల చరిత్ర వెలువడెను. అచిరకాలములోనే ద్వితీయ భాగము వెలువడునని ఆశించు చున్నాము. ఇట్లు విన్నవించు

కార్యదర్శులు:
డి. బాబన్న, కె. రాఘవేంద్రరావు

# మున్నుడి

"సాక్షరాః, రాక్షసాః" అని ప్రపంచాంధ్ర మహాసభా మందిరమున, (హైదరాబాదులో 12—4—1975 వ, తేదీన) ప్రతిధ్వనులీనిన, 'ఉగాది సందేశము' ను వినిపించి, 'విశ్వశ్రేయం కావ్యమ్మ' నుసూక్తికి, తార్కాణముగనైన శ్రీ కల్లూరు అహోబలరాయ కవిభూషణుఁడు, నాకు, చిరపరిచితుఁడు. సౌమ్యమూర్తి, మితభాషి, ధర్మప్రియుడునైన యీతని రాయలసీమ రచయితల చరిత్రకు, మున్నుడి వ్రాయు భాగ్యము నాకబ్బినది.

# శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల సంగ్రహ చరిత్ర

ఇయ్యది, 1931 లో బళ్లారి పట్టణమున కవిత్రయముచే 1) శ్రీ జోళీ కృష్ణమూర్తి 2) శ్రీ దేవదానము 3) శ్రీకల్లూరు అహోబలరావు గారిచే స్థాపింపబడెను. రాయలసీమ కవిపండితుల గ్రంథములను ప్రచురించి, వాటిని వెలుగులోనికి దెచ్చుట యే దీని ప్రధానోద్దేశ్యము. ఈ సంస్థ స్వలాభాపేక్షతో నెలకొల్పబడలేదు.

బళ్లారి పట్టణమున, శ్రీ విఠ్ఠాలు శేషప్పగారు, తహాసీలుదారు శ్రీ పిళ్లారిశెట్టి రంగబ్రహ్మము నాయుడుగారు, మునిసిపలు ఛేరుమెన్ సి. బాలాజీరావుగారు, శ్రీ టి. శంకరలింగం పిళ్ళెగారు, శ్రీ బెలోణ భీమరావుగారు, శ్రీ యం. దేవేంద్రం నాయుఁడు గారు శ్రీ వేదగిరి శెట్టిగారు, శ్రీ దివాకా బసప్ప గారు. శ్రీ చెరుకూరు భీమప్పగారు మొదలైన పురప్రముఖులీ గ్రంథమాలకు ఆర్థిక సహాయమొసంగి ప్రోత్సహించిరి.

అప్పట్లో, గ్రంథమాల సంవత్సరమునకు మూడు పుస్తకములను ప్రకటించి, ఒకరూపాయ చందాకే అపుస్తకముల నిచ్చుచుండెడిది. 1933 వ నాటికి, 9 పుస్తకములు ప్రచురింప బడెను.

16—9—1933 వ తేదీన గ్రంథమాల త్రైవార్షికోత్సవము, పేర్కొన్న బళ్లారి పుర ప్రముఖుల సాయముచే మహావైభవముగా నిర్వహింపబడెను. ఇందు ఆనాటి చిత్రము ప్రకటింప బడినది.

ఒక్క ' మాసీమకవు ' లను కవిచరిత్రను, శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి గారు వెలయించి, తెరనుకొంత పైకెత్తిరి. అది చాలదు. చౌడేశ్వరీవిలాస సులభరామాయణాదులు, లేపాక్షి రామాయణాది యక్షగానములను, బెడుదూరిహరిశ్చంద్ర మున్నగు బయలు నాటకములను, జానపదతత్త్వములను, బాడిన మహా మేధావులు, ప్రజా సన్మానముకాని, ప్రభుత్వ గౌరవముకాని, యందకనే కాలపు తెఱమఱుంగున దాటిపోయిరి. అట్టివారినికొంత నా 'వీరేశలింగ యుగము' లో తడవినాను కాని, అవిచారములు, వారిజీవిత చరిత్రలుకావు.

రాయలసీమ సాహిత్య చరిత్రము విభిన్న సారస్వత శాఖ లలో జరిగినకృషి; అష్టావధానాది చిత్రకవితా శేముషీ విభవము, కోలారు గనులదాక వ్యాపించిన రాయలసీమ (దక్షిణాంధ్రము) లోని శాస్త్రీయ విద్వత్తు (రాధాకృష్ణ విశ్వేశ్వరయ్య మున్నగు వారి) విశేషములను, వర్ణించు సమగ్ర గ్రంథము వెలువడిన గాని, వాఙ్మయపు తీరుతెన్నులు వెల్గునకురావు. కాన శ్రీ అహో బలరావుగారి గ్రంథము మనకెంతయు నుపకృతి మూలమనుట నిస్సందేహము.

ఇంతవరకును, సాహిత్య చరిత్రకారులు ప్రచారము బహు ళముగా నందుకొన్నవారి విషయములనే యెక్కువ వర్ణించుట జరిగినది. కవి చరిత్ర కారుఁడొకఁడు, వ్యక్తావ్యక్త కవితావ్యక్తు లనందరిని మూడు వాల్యూములలో చిత్రించినాడు. కవి సప్తశతి కారుఁడు నట్లే చేసినాడు. కాని చాలమంది. యే హేతువుచేనైన నేమి, పత్రికలకెక్కిన వారినే తడవి, సాహితీ విమర్శనలు వెల యించుటచే పాఠక లోకమునకు నప్రసిద్ధులైనను, ప్రసిద్ధులకంటె గొప్పవారో, తక్కువవారో అయిన యితరకవులు, సామాన్యము

# శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల సంగ్రహ చరిత్ర

ఇయ్యది, 1931 లో బళ్లారి పట్టణమున కవిత్రయముచే 1) శ్రీ ఓరుగంటి కృష్ణమూర్తి 2) శ్రీ దేవదానము 3) శ్రీకల్లూరు అహోబలరావు గారిచే స్థాపింపబడెను. రాయలసీమ కవిపండితుల గ్రంథములను ప్రచురించి, వాటిని వెలుగులోనికి దెచ్చుటయే దీని ప్రధానోద్దేశ్యము. ఈ సంస్థ స్వలాభాపేక్షతో నెలకొల్పబడలేదు.

బళ్లారి పట్టణమున, శ్రీ విఠ్ఠాలు శేషప్పగారు, తహసీలుదారు శ్రీ పిల్లారిశెట్టి రంగబ్రహ్మము నాయుడుగారు, మునిసిపలు ఛేరుమెన్ సి. బాలాజీరావుగారు, శ్రీ టి. శంకరలింగం పిళ్ళెగారు, శ్రీ బెలోణ భీమరావుగారు, శ్రీ యం. దేవేంద్రం నాయుడు గారు శ్రీ వేదగిరి శెట్టిగారు, శ్రీ దివాకర బసప్ప గారు. శ్రీ చెరుకూరు భీమప్పగారు మొదలైన పురప్రముఖులీ గ్రంథమాలకు ఆర్థిక సహాయమొసంగి ప్రోత్సహించిరి.

అప్పట్లో, గ్రంథమాల సంవత్సరమునకు మూడు పుస్తకములను ప్రకటించి, ఒకరూపాయ చందాకే అపుస్తకముల నిచ్చుచుండెడిది. 1933 వ నాటికి, 9 పుస్తకములు ప్రచురింప బడెను.

16—9—1933 వ తేదీన గ్రంథమాల త్రైవార్షికోత్సవము, పేర్కొన్న బళ్లారి పుర ప్రముఖుల సాయముచే మహావైభవముగా నిర్వహింపబడెను. ఇందు ఆనాటి చిత్రము ప్రకటింపబడినది.

మూఁడు చొప్పున, 9 గ్రంథములు ప్రకటించిరి. 1934 వ, సంవత్సరములో వీరుద్యోగరీత్యా, బళ్ళారి విడిచి, అనంతపురంజిల్లా కల్యాణదుర్గము తాల్లూకా, కల్యాణదుర్గము, బెళుగుప్ప, గంగవరము, మొదలగు ప్రాథమిక పాఠశాలలలో, ప్రధానోపాధ్యాయుఁడుగా పనిచేసి తుదకనంతపురము హైస్కూలు జేరిరి. 1951 వరకు, నానా చిక్కులకు లోనైనను, గ్రంథమాలను మఱవక 1951—53 లలో మూఁడు పుస్తకములను ప్రచురించిరి. ఇన్నియు నితర కవులవే ప్రధానముగ నైనవి, ఇతర కవిగ్రంథముల గూడ విక్రయించి కవులకు జేయూతనిచ్చిరి. అనంతపురములో, వీరి కష్ట కాలమున, శ్రీ పప్పూరు రామాచార్యులు కూడ, కొంత ప్రెస్సు బాకీలను విడిచిపెట్టి తోడ్పడిరి.

1956 లో, అనంతపురము హైస్కూలులో నుద్యోగ విరమణము చేసి హిందూపురము చేరిరి. శారదా విద్యానిలయమున (Aided School) 5 ఏండ్లు మఱల పనిచేసిరి. ఇచ్చట శ్రీ బాబన్న గారు, గ్రంథమాలోద్యమమును ప్రోత్సహించి, మొట్ట మొదట రూ॥ 116/— లను, ప్రసాదించిరి. హిందూపురమున దాతలేర్పడిరి. కాన, 1957 నుండి 1975 వరకు, మరల గ్రంథ మాల ద్వారా, పదిగ్రంథములను ప్రకటించిరి. "ధీరుల్ ప్రారబ్ధము లుజ్జగింపరు సుమీ" యన్న భర్తృహరి వాక్యాను సారము గ్రంథమాలా ప్రకటనోద్యమము విడువక,ననేక కవిమిత్రులను వీరు ప్రోత్సహించిరి.

రాయలసీమ రచయితల జీవితాలు వ్రాసిన శ్రీ అహోబల రావుగారి జీవితమించుక దడవితిని, వీరి మేనమామ కల్లూరు సుబ్బారావుగారు, రాయల కళాపరిషత్తును స్థాపించి. గ్రంథమాల కధ్యక్షులై, ఆమరణాంతము కృషిజేసిరి. అట్లనే వీరుకూడగ్రంథ ప్రకటనము నిల్పక, నేటివఱకు సాగించుచు, ఇప్పటి ప్రథమ

భాగముతోపాటు, ద్వితీయ భాగమునుకూడ వీరు వ్రాసి ప్రకటించ
టకు సంకల్పించినారు.

వీరు 1901 లో జన్మించిరి. కీ. శే. గూళూరు కృష్ణప్ప
గారు వీరితండ్రి. కల్లూరి సుబ్బరావుగారి అగ్రజ శ్రీమతి అశ్వ
ర్థమ్మగారు తల్లి. ఇతనికి ఆర్గురు కుమారులు గలరు. ముగ్గురు
కూతుళ్ళు గలరు. అందరు సత్సంతానవంతులు, అందరు ఆరో
గ్యంగా నున్నారు. వీరిభార్య సౌ॥ సీతమ్మగారు.

వీరికి, శ్రీ కూడ్లిగి శృంగేరి జగద్గురువులు 'కవితిలక
యను బిరుద మొసంగిరి. వీరు కుమార, భరత మాతృ శ
కములను, భావతరంగములు, పూదోట,భక్తమందారము, గ్రామ
పునర్నిర్మాణము, కన్నీటి కాలువ యను పద్య గ్రంథములను
వ్రాసిరి. యామినీ పూర్ణతిలక, శ్రీకృష్ణ, రామకర్ణామృతాంధ్రీ
కరణములు, గృహలక్ష్మి, పుష్పబాణ విలాసానువాదము, నవ
నివి వీరి యముద్రిత గ్రంథములు. వీరి భక్తి దీపకమగు సాం
బాబా గీతావళీ, దండకములు. నముద్రితములే. 'ఉగాది స్వా
భారతి' యను పేర వీరు ప్రతిసంవత్సరము వ్రాయుచుండిన ఉగా
కానుకలన్నియు కలిపి (రౌద్రినుండి పరీధావి వఱకు) నొకకృతిగ
ప్రకటించిరి. 1929 స॥ లోనే సద్దేశియోవసంతవాడి (బరోడ
బంగారు పతకమును వీరికి బహూకరించిరి. బహుగ్రంథకర్త
భక్తి ధర్మములు చాటిన, కవిచంద్రులు వీరు.

వీరితో, శ్రీ రూపనగుడి నారాయణకవి, శ్రీకప్పగ
సంజీవమూర్తి కవి, కిరికెర భీమరాయకవి, శిరిపి అంజనేయు

శ్రీ ఘూళీ కృష్ణమూర్తి. దేవదాసము మున్నగు రచయితలేకాక, రావాడ వేంకటరామాశాస్త్రిలు, మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్య శర్మ వంటి పండితులును మైత్రి నెఱపిరి. శ్రీ వేదము వేంకట కృష్ణశర్మ గారుకూడ, వీరి మిత్రులలో నొకరు. ప్రాక్తన జన్మ సముపార్జితమై, వీరికవితాధార సహజముగా ప్రవహించినది.

వీరిది మధురశైలి. విదుషీమణియగు వీరిభార్య వీరికి తోడ్పాటు. పుట్టపర్తి వారి వలెనే వీరిది విద్వత్కుటుంబము. వీరి తమ్ముఁడు నంజుండరావుగారు రాజకీయ పెన్షనుదారులై, మాన్యత గడించినారు. అందరును. మహాత్మగాంధి గారి భక్తులే.

కవితిలకులు, గాంధిగారి నిర్యాణము వ్రాయుచు, "బోసి నవ్వులతాత—మేకపాలే మేత" అను దివ్య సీసములో, బ్రహ్మ లోకమందు — భారతి ముంజేతిపైన దిరుగలాడ వాంఛగొనెను అని యెంతయు చక్కగ నూహించినారు. వీరు "జిఃబిలి పల్కులఁ తెలుగు చిన్నెలు వన్నెలు చిందులాడ, కోకిల కలరావముల్ వెలయ" కలకల కబ్బములు వ్రాయ సమకట్టినవారు. 'భావత రంగము' లో పసికూని వీపుపై, చీపురు పుల్లలతోకూడ మోయు చున్న పేదరాలిని, ముసలిభర్తలతో. మిడిమిడి యెండలతో బిచ్చమెత్తుచు మాడుచున్న వారిని. పిల్లలకు గంజినీరైన్గా నివ్వ జాలని వారిని చిత్రించడములోనికరుణాదృక్పథము, వీరినభ్యు దయ కవుల పంక్తిలో జేర్చుచున్నది. 'భక్తమందారము' లో వీరివైరాగ్యము మిన్నందినది. దేహము. నట్టేటిపైగంప, ముళ్ల కంప, తోలురక్తముల తిత్తియన్నారు. అతిసులభములైన నుడులతో, జాతీయములతో, పదములలాలిత్యము, మధురగానము

పరిణమింప, వీరు వ్రాసిన పద్యము లతిమనోహరములై, వీరి మంజుల కవితా రసావేశమును భావ చిత్రములనేకముల జూఱ నిచ్చును. వీరి గ్రంథమాలాకృషి శ్లాఘనీయము, వీరికవిత పానకము సోనలవలె, మంజులము, ఆకర్షణీయము భావ గంభీరమునైనది. వీరి జీవితమంతయు నిరాడంబర సేవతో నిండినది. భగవంతుఁడు సుకృతులగు వీరికి సిరిసంపద లారోగ్యమును ప్రసాదించుగాత ! ఇతోధిక సాహిత్యసేవ వీరాంధ్ర భారతికి చేయగల్గుదురని ఆశించు,

సుధీవిధేయుఁడు

మహాకవి, యజమాన, కల్లూరు వేంకట

నారాయణరావు గారు ఎమ్. ఎ. రిటైర్డు డి. ఇ.ఓ.

శ్రీపాదవిలయము

అనంతపురము 30—5—1975.



# మెప్పు

ఆంధ్ర సాహిత్యమున, ప్రాచీన కవిజీవితములు తెలియ పరచు, గ్రంథము లెన్నియోగలవు. నవీన కవుల చరిత్రలు గూడ చాలినన్ని గలవు. ఇవి కవికాల నిర్ణయము, కవి విరచిత

కృతులు, మనకందింపగల, సంపుటములేకాని. ఒక్కొక్క కవి రచనా విశిష్టత విప్పి చెప్పగల, విమర్శనాత్మకములైనవి — కొంఱ పడినవి,

ఈ కృతి శ్రీ కల్లూరు అహోబలరావు గారి చిరకాల తపః ఫలము చరిత్రి అనునామకరణము దీనికి చాల తగియున్నది. ఆయా కవుల — రచయితల, జీవిత విశేషములు, కృతులు పేర్కొనుట యే కాక ప్రోవులు, ప్రోవులుగా పద్యములుదహరించుటతో, గ్రంథకర్త అభిప్రాయముతో సరిపోల్చి చూచుటకు, ఈపద్ధతి చాల ప్రయోజనకారి.

ఈ ప్రథమ భాగమున, రాయలసీమకు చెందిన కవులు, రచయితలు, ఇరువదిమంది గలరు. ఇది అసమగ్రము. ఇంకను చేర్పదగిన వారెందరో గలరు. ద్వితీయ భాగమున ఈపని సమ గ్రము కాగలదని శ్రీ కల్లూరు అహోబలరావుగారి ఆశయము. ఆశయసిద్ధి కల్గుగాత!

ఈ సంపుటములో, చేర్పబడిన వారెందరో కీర్తి కాయులు. ఎనుబది సంవత్సరములపైబడిన వారును గలరు. ఒకరిద్దఱు పడివయస్సు వారును లేక పోలేదు.

ఇందలి భాష సరసమైన గ్రాంథికము. కవుల ఛాయాపటము లిందు చేర్చుటకు కృతికర్త విశేషశ్రమగైకొని ప్రశంసాపాత్రులైరి. ఇందు నవ్యరచయితలు కానరారు. మహిళా రచయితల జీవిత

ములు పేర్కొనుట అవసరము. ద్వితీయ సంపుటి ఆ కొఱత తీర్పగలదని నమ్మెదను.

శ్రీ కల్లూరివారి సాహిత్య కృషి మెచ్చుకోదగ్గది.

ఇట్లు

కుంటిమద్ది — బెళ్లూరి శ్రీనివాసమూర్తి

1-6-75 — మధురకవి

# సంపాదకీయము

అనంతపురము నుండి 1951 డిశంబరులో గ్రంథమాల 11 వ పుష్పముగా 'రాయలసీమ రత్నరాశి' వెలువడెను. అందులో 26 రచయితల కవితలమాత్రము జేర్చితిని. ఈ 'రాయలసీమ రచయితల చరిత్ర' లో, రచయితల చిత్రపటములతో, వారి జీవిత విశేషములు వారు గావించిన సాహిత్యసేవ, వారికావ్య పరిచయము, అందలి ప్రశస్త ఘట్టములను కొంతమట్టుకు చేర్చితిని. ఈ రచయితల విషయ సేకరణకు, 8-10 ఏండ్లు నుండి పాటుపడి, సుమారు వంద రచయితల చరిత్ర సంపాదించితిని. భావికాలము వారికి, ముంజేతి దర్పణమువలె ఈచరిత్ర యుండగలదని నా విశ్వాసము.

Who is Who' అను శీర్షికతో మనదేశములో పెక్కు సంస్థల వారు, 3-4 గ్రంథముల నింగ్లీషు భాషలో ప్రచురించి యున్నారు. వాటివెల లెక్కువగా యుండుటవల్ల సామాన్యులకా

పుస్తకములందు బాటులో లేవు. 'Who is who of Rayala seema writers' అను ఈ రాయలసీమ రచయితల చరిత్ర పరిశోధనా గ్రంథముగా చరిత్ర కారులకుపయోగ పడునని నాతలంపు.

'మెప్పు' లో శ్రీ బెళ్లూరివారు సూచించిన ప్రకారము, ముందు సంపుటములలో, మహిళా రచయితలను, నవ్యరచయితలను చేర్చగలము. 'మున్నుడిలో శ్రీ వేంకటనారాయణరావు గారు సూచించిన ప్రకారము, వాసవీ విలాసాది గ్రంథకర్తలైన, ఔలికి చిదంబ రాయకవి, లేపాక్షి యక్షగానరచయితలైన శ్రీ వేంకటరాయాది కవులు, మఱియు సులభరామాయణ గ్రంథ కర్తలైన శ్రీ మరూరు లక్ష్మీనరసప్ప మొదలైన కవులచరిత్రలన్నియు సేకరించి యున్నాము. అవి తప్పక ముందు సంపుటములలో వెలువడును. సాధ్యమైనంత మట్టుకు, మన రాయలసీమ కవుల నందరిని చేర్చవలయుననియే మా సంకల్పము. కాని ఈకార్యక్రమము దాతల విరాళముల పైనను. సాహిత్యఆకాడమి వారి ప్రోత్సాహము పైనను ఆధారపడియున్నదని వేరే చెప్ప నవసరములేదు.

ఆంధ్రరాష్ట్రేతర ప్రాంతములలో నున్న. రాయలసీమ రచయితలకెన్ని జాబులు వ్రాసి, మనవిచేసుకొన్నను, వారి నుండి ప్రత్యుత్తరములు లేవు. కాన మాకందు బాటులోవున్న అనంతపురము జిల్లా రచయితల చరిత్రముల నించుమించుగా అన్నియు సంపాదించితిమి. కడప, కర్నూలు, చిత్తూరు. వారివి కొన్నివచ్చినవి. రచయితలు. ఈ కార్యమునకు తోడ్పడ మఱల

మఱల మనవి; అంతియేకాని, బలవంత మాఘస్నానము పనికి రాదుకదా !

ఈ విషయములో మాకు శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి గారు, శ్రీ రాజన్న కవిగారు కొన్ని ఫోటోలబంపి సాయమొనర్చిరి. శ్రీ రాజశేఖర శతావధానిగారి బ్లాకు వారిఅల్లుఁడు మద్రాసు నుండి పంపి మాకుసాయమొనర్చిరి. వారికి కృతజ్ఞులము. కీర్తిశేషులైన, కవుల పుత్రమిత్రబంధు వర్గమునకు, వారి చిత్రపటములను పంపవలసినదిగా. పదేపదే కోరితిమి కాని, వారు బదులిచ్చు పాపానికి కూడ పోలేదు.

అందిన ఫోటోలకు, గ్రంథమాల ఖర్చుపెట్టి బ్లాకులను చేయించుటకు, సుమారు నాఁగు వందల రూప్యములు ఖర్చుపెట్టవలసివచ్చెను. ఈ రాయలసీమ చరిత్రలో అందరినీ చేర్చుటకు వీలుకాలేదు. అచిరకాలములో, ముందు భాగములు తప్పక వెలువడును. అందులో మిగత వారు చేర్చఁబడెదరు.

హైదరాబాదు సాహిత్య అకాడమీవారు. రూ. 1500/– ఈ ముద్రణమునకు సహాయ మొసఁర్చిరి. వారికి కృతజ్ఞులము. రెండవ భాగము త్వరలోనే ప్రకటింప బడుటకు సాహిత్య అకాడమీవారు, యథోచితముగా మఱల ద్రవ్యసహాయ మొనరించెదరని విశ్వసించు చున్నాము.

తెల్లకాకితపు ధరలు, ముద్రణఖర్చులు బ్లాకుఛార్జీలు పెరిగి పోయినవి.

చిన్న పట్టణము లందలి ముద్రణాశాలలలో ఇట్టి పెద్ద గ్రంథ ములను ముద్రింప తగినంత అవకాశములు లేకపోవుటచే, ఈ చరిత్ర–౧ లో చేర్చబడని రచయితల చరిత్రలన్నియూ తక్కిన సంపుటములలో వెలువరింపగలము. కొన్ని కారణాంతరములచే ఈ పుస్తక ముద్రణనకు 8 నెలలు కావలసి వచ్చెను. సాహిత్య ఆకాడమీ వారు మాఇబ్బంది లెఖింగి కాలమును పొడిగించి నందు లకు వారికభినందనంబులు.

ఈ సంవత్సరము. గ్రంథమాలకీ క్రింది వారు దాతలు గాను, మహారాజ పోషకులుగాను చేరి, ఈగ్రంథ ముద్రణము నకు సహాయపడిరి.

1. శ్రీ అనంతరామయ్య శ్రేష్ఠిగారు–హిందూపురం–

2. శ్రీ నరహరి సద్గురు సంఘము యొక్క పీఠాధి పతులు శ్రీ సింహాద్రి స్వాములవారు.

3. శ్రీ దాసాగోవిందయ్య శ్రేష్ఠిగారు–హిందూపురం

4. శ్రీ శ్రీరాం నరసయ్య శ్రేషిగారు–బెంగళూరు

5. శ్రీ కౌకుంట్ల వేంకటనారాయణగారు

6. శ్రీ కె. సి. మణిగారు హిందూపురం

7. శ్రీ యజమాన వేంకటనారాయణరావుగారు–అనంతపురం

8. శ్రీ గొల్లాపిన్ని—రామకృష్ణశాస్త్రి గరు—కడప.

మొదలగు ప్రముఖులందరూ మాకృషికి ధన సహాయ మొనర్చిరి. వారికి, వారి కుటుంబమునకు శ్రీ పరమేశ్వరుడు ఆయురారోగ్య భాగ్యములిచ్చి రక్షించుగాతయని ప్రార్ధించు చున్నాము.

ఈ పుస్తకమును సర్వాంగ సుందరముగ, తీర్చిదిద్దుట లోను, రచయితల చరిత్రల నందముగా పొందికగా, సుందర ముగా, ఏర్చి కూర్చి, తీర్చుటలోను మా చిరంజీవి కె. రాఘ వేంద్రరావు మిగుల శ్రమించినాడు. ముఖచిత్రమును, ముద్దుగా తీర్చినాడు, ఇతనికి వచన రచనలో వెన్నెవాసి, కళాదృష్టి కవి తలో భావ సంపద కలదు.

పుస్తకము యొక్క వెనుకటి అట్టలో ముద్రింప బడిన లేపాక్షి దేవాలయము యొక్క, 'పద్మిని జాతిస్త్రీ' బ్లాకును దయ తో ఇచ్చి సహకరించిన శ్రీ కె. సి. మణి గారి కభివందనములు.

తుదిమాట, బృహత్కార్యము తలపై పెట్టు కొన్నాము, పుణ్యమా! పురుషార్థమా! రామాయణమా! భాగవతమా! ఈ వృద్ధాప్యములో మీకీ బరువేల? అనువారులేక పోలేదు. ఈకార్య మెవ్వరు చేయలేదు. కీ. శే. జనమంచి శేషాద్రి శర్మగారు తల పోసిరి కాని, కార్య మాచరించలేదు. మీరీ కార్యము చేబట్టి యుండుట మాకుచాలా సంతోషము. పట్టుదలతో చేయండి మీకు ద్రవ్య సహాయము తప్పకరాగలదు" అని ప్రోత్సహించిన

మిత్రులు కూడా లేకపోలేదు. పొగడిన పొంగిపోము. తూల నాడిన నొచ్చుకొనము. ఈకార్యము భగవత్ప్రేరితము. ఈ నా సత్సంకల్పమును రాయలసీమలోని దాతలేకాక, రాష్ట్రేతర ఆంధ్ర మహాజనులుకూడ దాతలుగా చేరి, తమవిరాళ మొత్తములనుపంపి. జయప్రద మొనర్ప వలయునవియు, ఈపుస్తకము పెక్కుమంది కొని, గ్రంథమాలను ప్రోత్సహింప వలయునని విన్న వించు చున్నాను.

ఇట్లు

కల్లూరు అహోబలరావు
గ్రంథకర్త—సంపాదకుడు



# వి ష య సూ చి క



పేజిసంఖ్య







శ్రీకవిసార్వభౌమ-కావ్యకళానిధి
కవిసింహ అవధాని పంచానన

# శ్రీదుర్భాక రాజశేఖర శతావధాని.

జననము: 18—11—1888

నిర్యాణము: 30—4—1957

అసలుపేరు: కాళహస్త్యయ్య

| | |
|---|---|
| అధికారనామము: | రాజశేఖర శతావధాని |
| తండ్రి : | శ్రీదుర్భాక వెంకటరామయ్య గారు |
| తల్లి : | శ్రీమతి సుబ్బమ్మ |
| మతము-కులము; | హిందూ-బ్రాహ్మణ-స్మార్తులు |
| గోత్రము-నాడు : | శాలంకాయన—ములికినాడు. |
| జన్మస్థలము : | కడప జిల్లాయందలి జమ్మలమడుగు. |

## విద్యాభ్యాసము

వీరు తమ ప్రాథమిక విద్యను జమ్మలమడుగు. ప్రొద్దుటూరు లందు నేర్చిరి. 1904-1907 సం॥ల మధ్య 'తార్కికసింహ' బిరుదాంకితులు శ్రీకందాళ దాసాచార్యులు గారికడను, 'కళాప్రపూర్ణ' శ్రీజనమంచి శేషాద్రిశర్మ గారి సన్నిధిని సంస్కృతాంధ్ర సాహితీ గ్రంథములు నాటకాలంకార శాస్త్రములు జదివిరి. 1907లో మెట్రిక్యులేషన్ పరీక్ష కడప వున్నత పాఠశాలలో వుత్తీర్ణులైరి. మద్రాసు క్రైస్తవ కళాశాలలో ఎఫ్. ఏ. చదువుచు, మధ్యనే ఆపి వేసిరి.

ఉ ద్యో గ వి వ ర ము లు :

1908 నుండి ప్రొద్దుటూరులోని జిల్లా మునసబు కోర్టులో గుమాస్తాగా పనిచేసి, గాంధీవుద్యమ ప్రభావమువల్ల 1921లో వుద్యోగమును వదలిరి.

తరువాత కొంతకాలము ప్రొద్దుటూరు మునిసిపల్ కౌన్సిలరు గాను, 1928లో వైస్ ఛేర్మనుగాను పనిచేసిరి.

1927—32లో ప్రొద్దుటూరు తాలూకా బోర్డు ఉపాధ్యక్షులుగా నుండిరి. మదరాసు సెనేటు సభ్యులుగాను, వేదపాఠశాల కార్యదర్శి గాను పనిచేసిరి

సా హి త్య సేవ:-

వీరికి శ్రీగడియారం వేంకటశేషశాస్త్రిగారితో పరిచయము, సన్నిహిత మైత్రి కుదిరిన తరువాత, ఈ కవిశేఖరు లిరువురును ఆంధ్రదేశమున 'రాజశేఖర - వేంకటకవుల' ను జంటపేరుతో 1920—28 మధ్య పలుతావుల శతావధాన కార్యక్రమములు జరిపి, పెక్కు సన్మానములందిరి. వీరి అవధాన యాత్రావిశేషములన్నియు 'అవధానసారము' అనెడిగ్రంథమున పొందుపరచబడినవి. అవధానములను చాలించి, కవిశేఖరులు స్వతంత్ర కావ్యరచనకు పూను కొని కొన్ని, రసవత్కావ్యములను వెలువరించిరి.

వీ రి ము ద్రి త కృ తు లు

1) రణాప్రతాపసింహ చరిత్రము- 5 ఆశ్వా-200 పద్యములు ఐతిహాసిక ప్రబంధము—ప్రచురణ: 1934-35
2) అమరసింహచరిత్ర— 11 ఆశ్వా—2000 పద్యములు ఐతిహాసిక ప్రబంధము ప్రచురణ: 1951

3) వీరమతీచరిత్రము - 3 ఆశ్వా-300 పద్య-ఐతిహాసిక ప్రబంధము ప్రచురణ : 1951

4) చండనృపాల చరిత్రము- 700 పద్యములుగల గ్రంథము.

5) పుష్పావతి- 5 ఆశ్వా॥ శృంగార ప్రబంధము-1200 పద్యములు-ప్ర: 1949.

నా ట క ము లు

1) సీతాకల్యాణము 2) సీతాపహరణము 3) వృద్ధిమూల సంవాదము (2 అం॥) 4) పద్మావతీ విజయము.

ప ద్యా వ ళు లు

1) విలయమాధుర్యము(స్వప్నచంపువు) 2)స్వయంవరము 3) అనఘుడు (250 గీతములు) 4) గోదానము 5) శవన్నవ రాత్రులు.

సంస్కృతకృతి:- కామేశ్వరీ స్తోత్రమాలా

ఆంగ్లము :- దిహీరోయిన్స్ ఆఫ్ హిందూస్తాన్ (The Heroins of ' HINDUSTAN' )

అ ము ద్రి త ము లు:

(1 రాణీ సంయుక్త (హరికథా) 2) తారాబాయి (నవల) 3) టాడ్ చరిత్రము (కావ్యము) 4) రాజసింహ.

స న్మా న ము లు:—

సీ॥ వనపర్తి, బెజవాడ-కనగిరి, గుంటూరు
హైదరాబాదు, రాజమ్మపేట
యుయ్యేలవాడ—యేలూరును, జటప్రోలు
రాజమహేన్ద్రమ చంద్రాపురములు!
నెల్లూరుతెనాల్యాది, నిఖిలపట్టణముల
నెన్నిసన్మానమ్ము-లెన్నిసభలు

కదిరిమొదలొ్కొని, గంజామువఱకు మీ
రాణాపగ్రితాపు గౌరవము నిండె!
గీ॥ నిగనిగలు గొల్పు పెనుకొండ, "గగనమహాలు"
నను-గళాపరిషత్తు స్వర్ణమయ వజ్ర
మకుట మర్పించి నిను భక్తి, బూజచేసె
సరస గుణధామ। శ్రీకవి సార్వభౌమ!

(పుష్పావతి)

నారాయణస్వామి గారు కవిశేఖరుల నొకపరి దర్శించి నప్పుడు మాటలప్రస్తావమున వారి కృతులుపొందిన అనన్యవిఖ్యాతి నిగూర్చియు, వారుపొందిన ఘనసన్మానములను గూర్చియు మిక్కుటముగా శ్లాఘించిరి.

ఈ కవిరాజునకు, పెనుకొండయందలి 'రాయలసీమ కళా పరిషత్తు' వారు తమప్రథమ వార్షికోత్సవ సందర్భమున వీరికి స్వర్ణమయరత్న ఖచితకిరీటమును, సమర్పించి ఘన సన్మానము గావించిరి. ఆ కళా పరిషత్తునకు అధ్యక్షులు రాయలసీమ రాజకీయ కురుపితామహులు; అపరకృష్ణదేవరాయలను, ఖ్యాతివడసిన పద్మ శ్రీ కల్లూరు సుబ్బారావుగారు. వారికి మన రాయలసీమకు, ఆగౌరవ మర్యాదలు దక్కినవి. ఏకవీశ్వరుడు పొందని ఘన సన్మానమును వీరు పొందుట కామేశ్వరీ వరప్రసాదమే. "వరచారిత్ర కవిత్వ భారతి"-"కవిబ్రహ్మర్షి మూర్ధన్య" యను రెండు పదుల బిరుదము లను పొందిరి. రాయలసీమయందలి రత్నములలో ఇదొకజాతి రత్నము తరగని కాంతి.తగ్గనిధారణతో నిత్యనూతనముగా ప్రకాశించే వినూత్న కవిరత్నమిది. రాయలసీమ ఖ్యాతిని నిలబెట్టిన, గొప్ప కవివీరు.

కుటుంబచరిత్ర:-

---

తమపిన్నయ్యగారైన శ్రీ దుర్భాక సంజీవరావుగారే 'ఓనా మాల' మొదలు మెట్రిక్యులేషను వఱకు ఆంధ్రాంగ్లములను నేర్పించి

సర్వ ్వ, మర్పించి పెంచినవారని కవిగారు 'తమ కావ్యమున నుడివిరి. వీరిసతిమణి శ్రీమతి దుర్భాక లక్ష్మమ్మగారు. ఈ దంపతులకు కామేశ్వ`య్య'యను కుమారుడు పుట్టి ఏడునెలల కాలములోనే దివంగతుడైనట్లు కవిగారు తమ 'రాణాప్రతాపచరిత్ర యందు వ్రాసుకొనిరి (రా.ప్ర.సిం.చ-పద్య-52) తరువాత వీరికి ఒక్కగా నొక్క కుమార్తె వుదయించినది. కవిగా రామెను కామేశ్వరీదేవియని పిలిచిరి. వీరు శ్రీకామేశ్వరీ ఉపాసకులు. భక్తిభావనాయత్త చిత్తులు. రాణాప్రతాప సింహచరిత్రను తమ ఇష్టదైవమైన శ్రీ కామేశ్వరీదేవికే అంకితమిచ్చినట్లు ఈ క్రింది పద్యము తెలుపుచున్నది.

కం॥ ' ఈమహసీయ గ్రంథము-గై మోడ్చుచు నంకితమ్ము।
గానిచ్చెదనే। బ్రేమం బెసుపనోచని నా। కామేశ్వరునెత్తి పెంచు
కామేశ్వరికిన్.

కవిగారి కుమార్తె, అల్లుడు, శ్రీ డా॥యం. అనంతరామ్. యం.బి.బి.యస్.గారు ప్రస్తుతము మదరాసు పట్టణమున వున్నారు కవిగారికి శ్రీ యం. కృష్ణకుమార్ బి. స్. యల్. యల్. బి. గారను ఒక మనుమడు, డా॥ యం, చిత్ర యం. బి. బి. యస్. మరియు యం. మహేశ్వరి బి. యస్.సి.యనుమరాండ్రుకలరు.

## కా వ్య ప రి చ య ము.

రాణాప్రతాప సింహచరిత్ర—ప్రచురణ: 1934,35 (ఐతిహాసిక ప్రబంధము-5 ఆశ్వాసములు)

రాజశేఖరులవారికి పురాణాంశముల గుఱించిగాని, కల్పిత కథలనుగొని గాని, ప్రబంధములు రచించుట, తొలుతటినుండియు రుచించిసదిరాదు. జరిగినది జరిగినట్లు వ్రాసిపెట్టిన సత్యమగు, దేశ చరిత్రములు, ప్రజా ప్రబోధక,ప్రబల సాధనములు కాగలవని వారి విశ్వాసము. కనుకనే వారింతకు క్రితం వ్రాసిన రెండు పద్య గ్రంథములుకూడా దేశచరిత్రకు సంబంధించిన వై యున్నవి ఒకటి

'ఘూర్జర దేశచరిత్ర' యందలి 'వీరమతీదేవి చరిత్రము' రెండవది 'మేవాడ దేశచరిత్రమునందలి' చండ నృపాలచరిత్రము ' తరువాత వీరి ప్రయత్నము రాణాప్రతాప సింహుని దివ్యచరితముపై జరిగినది లెఫ్టనెంటు కర్నల్ జేమ్సుటాడ్డు దొరగారి, రాజస్థానదేశచరిత్రము చదివినప్పటినుండియు ఆ మహనీయుని 'చరిత్రను' కావ్యముగా రచించి యాంధ్రభాషా యోషామణి మృదుపదార విందముల చెంత సమర్పించుకొని, కృత కృత్యుడు గావలె ననెడికోరిక వారికి గలిగి నట్లు కవిగారే, స్వయముగా ఈ గ్రంథమున వ్రాసుకొన్నారు.

ఈ గ్రంధముపై ప్రసిద్ధకవి రత్నమైన శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు తమ అభిప్రాయము, నిట్లువెలిబుచ్చిరి.

" ఒకానొక కాలమున నేనును ప్రతాపరాణా చరిత్రమును పద్యకావ్యముగా వ్రాయ నుత్సాహపడి, యుపక్రమించియుండిన వాడను.సుమారు 300 పద్యములువ్రాసి నడుమంత్రమున,వదలితిని వ్రాతగ్రంధముకూడా నావద్దలేక నశించినది.తమగ్రంథము,జదువ మొదలిడగానే నాప్రయత్నము నిరవశేషముగా నశించుట,యెంతో మేలాయె, ననిపించినది. ఇంతగొప్ప గ్రంథమును ఒకటే ధారతో అందదుకులు, తొందుకులు, లేక రచించి ముగింపగల్గిన తమశక్తి సామర్థ్యముల కాశ్చర్యపడి అభినందించుచున్నాను. తమది ప్రబంధముల పక్వతతోకూడిన పురాణశయ్య. ఈ శైలిలో నిజముగా దామొక, పురాణమునే వ్రాసియుండిన నెట్లుండెడిదోయని యాశ పడుచున్నాను. ఈ స్థితిలో నీకావ్యము నింతరసవంతముగా పఠనీయముగా జేయ శక్తులు చాలామంది లేరనుట నిస్సందేహమైన విషయము. (రాళ్లపల్లి అనం. కృ.శర్మ )

కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారీ ఐతిహాసిక ప్రబంధముపై నను-కవిగారియెడలను ఈ క్రింది అమోఘమైన అభిప్రాయమును వెల్లడించిరి.

"-భారతము పూర్వకాలపు కధనేచెప్పును. అందులోవున్న ధర్మముమాత్రమే, మనజాతిది. ఆ విషయము ద్వాపరయుగము నాటిది.మన పరిస్థితులతో సంబంధము లేనిది. ప్రతాపసింహచరిత్ర మనధర్మమునే కాక, మన పరిస్థితులనుకూడా చెప్పును. అక్బరు చక్రవర్తితో పాతికయేండ్లు, హోరాహోరిపోరాడి, స్వదేశమువదలి కొండలలో గుట్టలలో నివసించి, తిండిలేక,గడ్డి రొట్టెలుతిని, దైవ వశమున మఱల స్వాతంత్ర్యమును, సంపాదించిన మహాపురుషుడు రాణాప్రతాపుడు ఆయనకన్నా ధర్మరాజాదు లేమియూ నెక్కువవారు కారు.వస్తుగామ్యతకుగాని కథాచమత్కారమునకుగానిఇందలి భిన్నపాత్రల భిన్నతా విశిష్టతకుగాని భారతమున కీగ్రంధము తీసిపోదు. వస్తువిటువంటిది.

కవి - యెటువంటివాడు?

---

వ్యాసునకు తిక్కన్నకునెంత వీరరసావేశమున్నదో యంత వీర రసావేశముగలవాడు. భారతములోని యుద్ధపంచకము తిక్కన్నగారు వ్రాయకయుండినచో, మఱియెవరు వ్రాయగలుగుదురని ప్రశ్నించినచో, నేను 'రాజశేఖర-శతావధానిగా "రని సమాధానము చెప్పెద. ఈ గ్రంథములో, చివర నాల్గాశ్వాసములు యుద్ధమే తప్పవేఱేలేదు. యుద్ధవర్ణన యెచ్చటచూచినను, తిక్కన్నగారి రచనతో, తులదూగుచున్నది.ఈ గ్రంథము ఉస్వతంత్ర జాతికొక స్మృతి గ్రంథమువంటిది.

రాణాప్రతాపునకును, మహాత్మునకు గల సామ్యము భారత జాతికి గల యస్వతంత్రత. మహాత్మునిది కత్తిలేని సాత్త్వికపు పోరు-ప్రతాపునిది కత్తిగల సాత్త్వికపుపోరు. ప్రతాపసింహుడు అక్బరును జయింపవలెనని యుద్ధము చేయలేదు. ధర్మముకోసము యుద్ధము చేసెను. భారతజాతీయ ధర్మము పరులకు లొంగిపోదు-చచ్చిపోదు—అనిఋజువు చేయుటకే యుద్ధము చేసెను.

" కాన విజయంబు ముఖ్యంబు గాదుమనకు
ధర్మనిర్వహణంబు కర్తవ్య మిపుడు. "

ఇది ప్రతాపుని యూహ. నేటిసత్యాగ్రహమునకు ఆనాటి ప్రతాపుని యుద్ధధర్మమునకు భేదమేలేదు.

ఇట్టిగ్రంథరచన సామాన్యకవి చేయునదికాదు. ఇది తిక్కనాదులు చేయదగ్గది. ఇది పరమోత్తమ గ్రంథములలోనొకటి
(శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి సమీక్ష నుండి.)

రాయలసీమ ఖనినుండి వెలువడిన కోహినూరువలె ఆంధ్ర భాషా సరస్వతి కిరీటమున, వెలుగు కావ్యరత్నకృతియిది. ఇందలి ప్రశస్తఘట్టములలోని, వీరరసమును కొద్దిగా చదిచూడదు.

భానుసింహ-వీరబలులయుద్ధము. తృతీయాశ్వాసముసుండి)

---

ఉ॥ వాడినచేనిపైఁబడెడు-పర్షమునట్టుల,మానసింహుకుఁ
దోడయివచ్చినంతయవసర్,ధృతిలోఁజెలరేగిమూపులుఁ
మూడయిపొంగ వీరరసపూర్ణుఁడు,వీరబలుండుయోధులఁ
గూడి,యెదిర్చెనయ్యహితకుంజర సింహము,భానుసింహముఁ

-

మ॥ కరవాలంబులు, కన్నుగోనల,స్ఫులింగశ్రేణి నల్దిక్కులఁ
బరవఁ భీషణచంద్రహాస, రుచులభ్రింబంటి, వర్తింపని
ర్వ్వరు, గంధర్వములఁ విచిత్రగతులఁబోనిచ్చుచుఁ
దాకి,సం
గరముఁజేరి,బాహుశౌర్యము, సమగ్రప్రౌఢి దీపింపగఁ

౩

మ॥ తన గర్జారవధాటికిఁ దెసలు బ్రిద్దల్ బ్రిద్దలై పోవ, నూ
తన సంరంభ విజృంభణంబున. నమిత్రశ్రేణి, భీతిల్లగా
వెనుకఁ జూడక, భానుసింహుడు, రణోర్విఁ శాత్రవుఁ
దాకి,యాతని యశ్వంబు,గళంబునుఁదఱిగె; నుద్యత్ఖడ్గ
ధారాహతిఁ

౪

కం॥ కమల సరోవరమున, ద్విర
దము, విహరించిన విధాన—దనివి సనక, వి
క్రమరాశి, భానుసింహుఁడు
సమయించెఁదురుష్క—భటుల—సమరతలమునఁ

౫

చం॥ అదిగని మానసింహ విభు డంబరువీరుల 'భానుసింహుపై'
గదిసి, రణంబుసేయుదని-కట్టడ సేయగ, నట్టహాసముల్
పొదలగ వారుపై బడిరి—భూరిభుజాబలరేఖ యొప్పగాఁ
గదనము,చేయసాగె లయకాలయముండన,నాతఁడుగ్రుఁడై

## అమరసింహచరిత్ర

ఈ అమరసింహ చరిత్ర వ్రాయుకాలము నాటికి కవిగారి వయస్సు అరువది రెండేఁడ్లు. అప్పటికే వారు వృద్ధాప్యమును పొందినట్లు చింతించి తమ అవతారిక యందిట్లు తెలుపుకొనిరి.

" అమృతరస మొల్కు మధురకా—వ్యములువ్రాయ
నాకసముఁ మింగునంతటి-యాసగలదు
కలముఁబట్టిన యంత దుర్బలత—దోచు।
దగిన బలమీగదమ్మ। కాత్యాయనమ్మ!

ఆఱువది రెండువచ్చె;సక—లాంగములుఁ వదకంగఁజొచ్చె;ధీ
గరిమము నొచ్చె; దుర్బలత-కార్శ్యముహెచ్చె; గరంబునీరస
స్ఫురణమునొచ్చె;ధారణ స—ముద్ధతి విచ్చె గృతుల్ రచింపనా
తరమె భవానిః నీవుకృప—తప్పినఁదప్పు సమస్త యత్నముల్."

అమరసింహ చరిత్రమును చదువుచున్న పాఠకున కెవ్వనికిని కవిగారికి ఈ కృతి వ్రాయునాటికి అరువది రెండేండ్లుగా వూహించరు. పదహారేండ్ల రసపుత్ర వీరుడే ఈ కృతిని తెనిగించినట్లు తోచును. ఈ రసపుత్రుని చరిత్ర వ్రాయునప్పుడు కవిగారు శారీరికముగా శక్తివంతులు కానప్పటికిన్నీ వారికీ వుత్తేజము,ఉద్రేకత, శక్తి సామర్థ్యముల నిచ్చినదా రసపుత్రులేయని చెప్పక తప్పదు. కవిగారే తమ స్వానుభవమునిట్లు తెలుపుకొనిరి.

సీ॥ రాజపుత్రస్థాన-కవివంశ నరపాల
కులమాట మదినను-కొనినయంత-
నేహేతువోకాని—దేహంబెఱుఁగకుండ
రసవ స్సదేశ్రికథా-రమ్మదోచు
భావముల్ శరపటం—పరగాగదోచియా
నందబాష్పములుదొం-తరలుగట్టుః
మది, జరిత్రాంశముల్—మెదువ, నంతలా,క
థాంశముల్ తోచునో—యమటసింహ
భూవరు చరిత్రమేతోచు-నో వచింపఁ
జాలః నేమైనఁగాని, నీ-చరణయుగళ
మెడఁద నిల్పుచుఁగృతిమొద-లిడెడువాడః
శైలరాజన్యకన్యః సౌ. జన్యధన్యః

అమరసింహుని కుమారుడు కర్ణుడు. జహాంగీరు పాదుషా కుమారుడైన ఖూరుము (పిదప నితడే షాజహాన్ చక్రవర్తి) తో యుద్ధమెట్లొనర్చెనో ఒకచిన్న కంద పద్యమున అతి చక్కగా అతుకునట్లు అల్లిరి.

కం. గరుడుడు. గరుడుడు, శరనిధి
శరనిధి, డేగయును డేగ-శైలముశైలం
బురవడినిదాకి నట్టులు
దురమున యువరాజుయుగము డొడరెన్ గడిమిన్.

కర్ణుడు, ఖూరుము రాకుమారుని యుద్ధమందు నిరాయుధుని గావించెను. నిరాయుధుడై నిల్చిన యవన యువరాజును గాంచి కర్ణుడు తనకు తెలిసిన యుద్ధ ధర్మము నిట్లు తెలిపెను.

గీ॥ వీర!నీచేతి ఖడ్గంబు-జారెగాన
నిదియ యవనని మేలొంద—నెంచి నిన్ను
డొడర నుఁకింప, సందేహ-పడకు! కర్ణు
డంత యన్యాయ వర్తనుం-డనుకొనకుము.

ఇట్టి యమృత రస సంభావిత వాక్యములు విన్నయా యవన, యువ రాజునకు కొంత,గగ్గుర్పాటు, అతడెవరన్న ఆశ్చర్యముగలిగి, సందేహము నడిగి తీర్చుకొని, సంభ్రమమున అశ్వము దిగివచ్చి కర్ణుని కౌగలించుకొని "నినుగన నేంగ్లనుండి కోరుచునుంటిన్" అనిపల్కి ప్రేమతో ఆతని మైత్రి కోరుచు యిరుపక్షముల శ్రేయస్సుకొరకై యిట్లు పలికెను.

సీ॥ " పితరుల కాలమీ - గతిజెల్లె రణములు
మన కాలముల్లైన - మాన్పదలచి
పరమ సౌజన్యసే - వధివంచు నిసుగూర్చి
వినియుండి నీతోడ - విన్నవింప
మేవాడకునుఢిల్లి - కీ వైరములుమాను
నని యేండ్ల నుండినే - నఖిలషింతు
నిన్నాళ్ళకాభాగ్య - మిటుగల్గె! గన్నుల
కలవు దీఅగనిన్ను - గాంచగంటి
గీ॥ శాంతి నాకిష్టమని చిన్న - సంజ్ఞ చేయు !
మింక మేవాశకునుఢిల్లి - కెపుడుగాని
సమరములుగాని సంఘర్ష - ణములుగాని
పొరయ కుండంగ జేతునే - చరణమాన "

సంధి జరుపుకొన్న విషయము తెలిసిన తరువాత అమరసింహ చక్రవర్తి మనమున పరిపరి విధముల పరితపించెను. తనరాజ్యమును కర్ణకుమారున కప్పగించి యాతడు

గీ॥ రాగవిరాగముల్ - మూగనిచోటు! కా
మక్రోధములు లేని - మంచి చోటు!
పరజయాపజయముల్ - బాధసేయని చోటు!
కష్టసౌఖ్య వివక్ష - గననిచోటు!
స్నేహ వైరములు శాం - తిని మారుపనిచోటు
లాభనష్టములు మె - లగని చోటు
పూర్ణ విశ్రాంతికా - పురముండు చోటు! మ
హానంద నిలయమై - యలరు చోటు
గీ॥ ప్రకృతి వైభవమెపుడుచే - ద్పకని చోటు!
విశ్వనాథుండు మ్రోల గన్పించు చోటు!
వ్యాఘ్రశైల ప్రశాంత గుహాంతరములు
శాశ్వత స్థాయిగా నాకు శరణమగుత"
అనుచు అతడు తపమాచరించుటకు వెడలి పోయెను.



ఆంధ్ర కర్ణాటక, కవి కేసరి,
మహాకవి, సవ్యసాచి,
సాహిత్య సరస్వతి

## శ్రీ కిరికెర రెడ్డి భీమరావు

జననము: **13—6—1896**
నిర్యాణము: **9—3—1964**

| | | |
|---|---|---|
| తండ్రి | : | రెడ్డి అప్పారావు గారు |
| తల్లి | : | వేంకటలక్ష్మమ్మ |
| మతము-కులము | : | హిందూ-బడగలనాటి బ్రాహ్మణులు. |
| గోత్రము | : | గౌతమసగోత్రులు. |
| స్వస్థళము | : | అనంతపురం (జి॥) హిందూపురం (తా॥) కిరికెర గ్రామము. |

విద్యాభ్యాసము

మాధ్యమిక విద్య హిందూపురము నందలి ' ఎడ్వర్డు కారనేషను ' బడిలో మిక్కిలి శ్రద్ధగా చదివెను. అప్పుడు శ్రీ యుతులగు కల్లూరు సుబ్బరావుగారు, గురుమూర్తిగారు, దొంతి భీమయ్య శ్రేష్ఠి గారు, లేపాక్షి వెంకటనారణప్పగారు మున్నగు సుప్రసిద్ధులు వీరికి సహ పాఠకులుగా నుండిరి. మాధ్యమిక విద్య ముగిసిన పిమ్మట హిందూపురమున సున్నత పాఠశాల అప్పుడు లేని కారణమున తోడిబాలురతో గూడి బెంగళూరు నగరమునకు వెళ్ళి 'మిషన్' స్కూలులో కొన్ని సంవత్సరములు, అటు పిమ్మట మైసూరునకువెళ్ళి 'మెట్రిక్యులేషన్' పరీక్షలో నుత్తీర్ణులైరి. స్వయం కృషివల్ల, కర్ణాటక గ్రంథ పఠనము గావించి, ఛందోవ్యాకరణాది

శాస్త్ర నిష్ణాతులై, తద్భాష యందును, కవనమల్ల నభ్యసించిరి. మైసూరు సంస్కృత కళాశాల యందలి పలువురు పండిత వర్యుల కడజేరి, గీర్వాణ భాషనభ్యసించిరి. వ్యాకరణాది అలంకార సూత్రములను చక్కగా బఠించిరి. ఆయుర్వేదము జ్యోతిశ్శాస్త్రము సాముద్రికము, వేదాంతము, మున్నగు వేదాంగములకు మాతృక లైనవాటిని, గీర్వాణ భాషలోనే పరిశ్రమ మొనర్చి వాటి మూల సిద్ధాంతములను గ్రహింప గలిగిరి.

## ఉ ద్యో గ ము;

పెనుకొండలో అసిస్టెంటు ఇంజనీయరుగారి ఆఫీసులో క్లార్కు గాచేరి, ఒక సంవత్సర కాలము పనిచేసిరి తరువాత ఇరువది రెం డవయేట తండ్రిగారు మరణించుటవల్ల కవిగారు వంశపారంప ర్యముగా వచ్చు మునసబు వుద్యోగమున ప్రవేశించిరి.

## బి రు దు లు :

పెనుకొండలో ఉద్యోగము చేయుచున్న సమయమున అక్కడ కవిగారు కొన్ని గ్రంథములు వ్రాసిరి. అక్కడి బాలసర స్వతి మండలివారు కవిగారిని గుర్తించి 'బాలకవి' బిరుదముతో సత్కరించిరి. 1946 లో బెంగుళూరు విశ్వకళా పరిషత్తు వారు కవి గారి నాహ్వానించి, కవిపండిత సమ్మేళనమున "ఆంధ్ర కర్ణాటక కవికేసరి" యను బిరుదముతో సత్కరించి, తమగౌరవ ప్రపత్తుల వెల్లడించిరి. 18-11-1956 తేదిన బళ్ళారి యందు కవిగారికి 'కవి సవ్యసాచి' యను బిరుదమిచ్చిరి.

## కుటుంబ వి శేషములు:

ఇరువది రెండవ యేట కవిగారు వివాహమాడిరి. వీరికి

ఒక కుమారుడు, ఒక కుమార్తెయు కలిగిన తరువాత కవిగారి 32 వయేట, వీరి భార్య గతించెను. ప్రస్తుతము వీరి కుమారుడు శ్రీ అప్పారావుగారు కిరికెర గ్రామ మునసబుగా నున్నారు.

రచనలు

శతకములు:— 1) వాయునందన శతకము 2) భీమేశ్వర శతకము. 3) భక్తి పంచకము (5 శతకములు) వచన రచనలు:- 4) తిరుమలాంబ 5) శత్రు నిగ్రహము 6) దశావతారములు నాటకములు:- 7) మహేంద్ర విజయము 8) చంద్రమౌళి హరికథలు:- 9) గరుడ గర్వభంగము 10) సీతా కల్యాణము 11) కృష్ణరాయబారము 12) కృష్ణగారడి. జ్యోతి శ్శాస్త్ర గ్రంథములు 13) జాతక సుధానిధి (1—2 భాగములు) 14) యోగాయుర్దాయ దర్పణము 15) భీముని సాముద్రికము ఇతర కృతులు;- 16) జ్ఞానవాశిష్ఠ రత్నములు 17) విజయనగర కళావిలాసము 18) పితృభక్తి (తండ్రిస్మారక చిహ్నము) 19) జగన్నాయక తారావళి

కర్ణాటక గ్రంథములు

1) భగవద్గీత 2) ఉత్తరగీత 3) గీతాంజలి 4) విజయగౌతమ 5) భీమేశ్వరీయము 6) పాండవాజ్ఞాతవాస. 7) కృష్ణ మాయావిలాస. 8) యుగంధర ప్రజ్ఞె

కడపట దశయందు వ్రాసినది.

1) యోగవాశిష్ఠము 2) అధ్యాత్మ రామాయణము.

## జ్ఞానవాశిష్ఠ రత్నములు:—

శ్రీ కృష్ణ దేవరాయ గ్రంథమాల వారు, ఈ కృతిని 13వ పుష్పముగా 1957లో ప్రకటించిరి. ఈపొత్తములోని వచనరచనలు శ్రీ డి. బాబన్నగారివి. ఇయ్యది సంగ్రహ కావ్యము గనుక, పూర్వాపర కథాసందర్భముల, నావచన రచన లతికించుచు పాఠకుల మనముల నాకర్షించును.

కం. ఎక్కడి సంసారంబిది?
యెక్కడి ఘోరంబుపీడ? యెక్కడిదోఁనా
కొక్కటియు దోపకున్నది
నిక్కడి కామాదిరిపులు-నిఖిలేంద్రియముల్

౨

కం. మీరెఱిఁగిన, సుజ్ఞానము
వారక యుపదేశమొసఁగి వాత్సల్యంబిం
పార, ననుఁ జూడవేడుదు
సార తపోబలవిశాల! సన్మునిచంద్రా,

౩

చం॥ విరహిత గర్వియై, వరవివేకియు, భోగవిదూర చిత్తుఁడై
సరసత నిస్పృహుండునయి, శాంతినిగల్గి, విజృంభణంబుగా
బరగు, నహంకృతోక్తుల, వివాదములన్ దరిఁజేరనీయ, కా
దరమతిఁగాంచగావలయు-దాశరథీ పరమంబుఁ జెందఁగన్.

౪

సీ. ఎలుకలు కొఱికిన—వలరీతి నశియించు
సంసార వాసన—సక్రమముగ
తెగును, మనోగ్రంధి-తెంపు సందరువాయి
ప్రవిమల జ్ఞాన, స్వభావమంత
సజ్జుగా, నిత్యప్రసన్నమై-నెగడుచు
నలరు ప్రత్యక్ష మీ-యనుభవంబు
గల్గి, యోగ బునే—గడన సర్వేడు వాని
కరుణకుఁ బ్రహ్మాది సురలు పాత్రు

గీ. లగుదు రట్టి, యోగాభ్యాసుఁడగణితుఁడయి
దిగ్వితానంబులెల్లను-దెల్లముగను
గనులు నైజంబుగా జూచు-కరణి జిత్త
గతియె లేకుండ, దాఁజేయు కర్మలెల్ల.

విజయనగర కళావిలాసము(లేపాక్షి) ప్రచురణ 1957

ఈ కృతి "పద్మశ్రీ" కల్లూరు సుబ్బరావు గారికంకిత మివ్వబడినది.

చం. అది, విరుపణ్ణ నిర్మితమునై, యెసలారెడు, దేవమందిరం
బది, యొకశిల్పరత్నమనసై, మసరాయలసీమ కీర్తి,కా
స్పదమయి,శిల్పనైపుణి,సభంగురభంగిని, జాటుచుండు;వే
ఱెది, సరిరాదటంచు,మది కెంతయు మోదముఁగూర్చు
చుండెడిన్.

## దుర్గాదేవి

ఉ. అద్రిజ! దుర్గ! నాడు మహిషాసుర మర్దనివైన మీద నీ
వొద్దిక నా మహేశ్వరు, మహోన్నత పీఠముజేరితందురా
సుద్ది హుళక్కి; యిందె నిజసూనుని బాయఁగ లేకనిల్చి, యీ
ముద్దులపట్టి, భద్రు నగుమోమును గాంచెదు; స్తంభ
మందునన్.

సీ. రాజాను పతిలేక—రాష్ట్ర ధనంబెల్ల
ఆలయంబునకు, వ్యయంబొనర్చి
ద్రోహమొనర్చిన-దుర్మతి విరుపణ్ణ
బట్టితెంశని, నృపవర్యుఁడలిగి
ముదల నిడిన, నంత, మదిఁబొక్కి, యీవార్త
నాలకించుచు, విరుపాఖ్యుఁడపుడు
కనుగ్రుడ్లఁ బెకలించి—కడుకొని, శిలపైనఁ
గొట్టె నటందురు క్రూరగతిని

గీ. నమ్మఁజాలమిద్ది; నలువారఁగళలెల్ల
వృద్ధిసల్పి శిల్పి విజ్ఞతలకుఁ
దగిన గౌరవంబు-దైవాలఁగూర్చిన
రసికుఁడిటు లొనర్ప బొసగు నెట్లు?

ఉ॥ ఈ రతనాల బొమ్మలను—నెవ్వరు పాడొనరించిరో, నిరా
ధారము కారణంబు; మతదర్ప సమన్వితులై-మహోగ్రులై
క్రూరులు చెక్కువై చిరా విరోధము నూనుచు, లేక యిట్టి శృం
గారము పాడుచేయుదురెః కన్నులపండువుఁగూర్చు
చుండగన్.



కవిచంద్ర

## శ్రీ యమ్మనూరు సుబ్రహ్మణ్య శర్మ.

జననము— పార్థివ నామ సంవత్సర మాఘ॥ శుద్ధ పంచమి.

జన్మస్థలము: కొండాపురము హిందూపురం తాలూకా. అనంతపురం జిల్లా

తల్లి : వెంకమ్మ
తండ్రి : శేషశాస్త్రి
కులము : బ్రాహ్మణ-శౌనకసగోత్రము—ములకనాడు.

### విద్యాభ్యాసము వగైరా:

పిన్నతనమున, పల్లెటూరి బడిపంతుల వద్ద విద్యాభ్యాసము. ఉపనయనమైన పిదప, మదనపల్లె తాలూకు, 'చదుము' గ్రామములో శ్రీశంకరావధానుల వారి వద్ద 'యాజుష' పూర్వ ప్రయోగమాదిగ వేద విద్యాభ్యాసము చేసిరి.

స్వగ్రామములో శ్రీరంగనాథ రామాయణము, శ్రీమదు త్తర రామాయణము, భాగవతము, సాయంకాలముల యందు చదివి శ్రోతలకు వినిపించెడివారు.

కవిగారికి ఒకనాటి రాత్రి నిద్రలో "మారసుందర! ధీరగంభీరా! సరసుడా! యేరా! మేఁగాదిక; చాలు పోపోరా!" అనియెడు రాధాకృష్ణ సంవాదపుపాట 'జావిడి' నోటికి వచ్చెను. మేల్కాంచి ఆ నాల్గు పాదములను వ్రాసుకొని ఆధాటి తెలిసిన వారికి చూపించగా వారు రాగతాళములు, విశదముగా తెలుపుచు 'యత్రలయస్తత్రియతిః' అని కవిగారిని ప్రబోధించగా, నాటినుండి దైవ సంబంధమైన భక్తియుక్తమైన పాటలు రచియించి వెలయించిరి. ఇట్లుండగా, 'కుందలగురికి' వేంకటనారాయణ కవిగారు వేంచేసి, పద్యములల్లుటకు ఛందో వ్యాకరణ పద్ధతులు, కవిగారికి తెల్పగా దానియందు కృషిచేసి 'శ్రీ పులివెందల రంగనాయక శతకము' 'శ్రీకర్ణాభ్యుదయ' ప్రబంధము రచియించి, గోరంట్ల (హిందూపురం తా॥ అనంతపురం జిల్లా) గ్రామములో రామాలయములో కృష్ణమూర్తికి, కృతి సమర్పణ చేసిరి. ఆ పండిత మండలి మహాసభలో సభాధ్యక్షులుగా విలసిల్లిన శ్రీచిలుకూరు నారాయణ రావు గారు సభికుల అనుమతిపైన 'కవిచంద్ర' యనెడి బిరుదు కవిగారికొసంగిరి.

## కుటుంబ సంగ్రహ చరిత్ర:

కవిగారి పూర్వీకులు బుక్కాపట్టణమునకు దగ్గరగా వున్న 'క్రొత్తచెఱువు' (అనంతపురం జి॥) గ్రామ నివాసులు. వీరి వంశమునకు 'యజ్ఞరామసోమయాజి' మూలపురుషుడు. అతనికి లింగసోమయాజి ప్రథమ పుత్రుడు. అతని కుమారుడు శేషశాస్త్రి గారు వారి సహధర్మిణి శ్రీమతి వెంకమ్మగారు. వారికి కవిగారు జన్మించిరి. వీరి ఏకైక కుమారుడు శ్రీ నాగేశ శర్మ గారు ప్రస్తుతం బెంగుళూరు, జయనగరమందలి వాణీనిలయములో వున్నారు. నాగేశశర్మ గారికి యిరువురు పుత్రులు, యిరువురు పుత్రికలు కలరు. కవిగారు వీరి వద్దనే ప్రస్తుతమున్నారు.

## కవిగారికృతులు

1) శ్రీరుక్మిణీ కల్యాణము, 2) వామన చరితము, 3) అనసూయ 4) సావిత్రోపాఖ్యానము 5) కర్ణాభ్యుదయము (ప్ర. 1947) 6) శ్రీ భక్తజన మనోభిరామము.

## శ్రీ కర్ణాభ్యుదయములోని కొన్ని రసవంతమైన పద్యములు.

—— కుంతిదేవి యశ్వనీనదిలో పేటికను విడుచుట. ——

ఉ॥ కన్నెఱికమ్ముఁగాచుకొన • గాదిలి పట్టిని నొప్పిగించెదన్
బన్నగశాయిపాదభవ • పాప విభంగ!కృపాంతరంగ!యో
సన్నుత దివ్యగంగ!నవ•సారస భృంగ తరంగ రంగ! నా
చిన్నకుమారునిన్ విజిత • చిత్తజరూపునిఁగావ వేఁడెదన్.

క॥ అనుచున్గొని యాడుచునా
జననాథుని పుత్రి • మంజసన్నెను వఱదన్
వనరుచు విడువఁగ నదియునుఁ
జనె నాపై నేమిసెప్ప • ఁజాలుదు నధిపా!

క॥ పెన్నెతో మున్నీరో
కన్నీరో తెలుపరాదు • కాంతామణికిన్
గన్నులఁగాఱెడు నశ్రువు
లన్నన్నా! జూచి నగునె! యా • యలమటయున్,

—— పుత్రునికై కుంతీదేవి దుఃఖించుట. ——

ఉ॥ హా!యను;ముద్దుగుల్కుతన•యా!యనునిర్జితసుందరాస్య చం
ద్రా!యనుఁదాపదుఃఖ రహి • తా! యను నిందిత శంబరారిరూ
పా! యను దివ్యధామ దిన•పా! యను బంధుర భర్మవర్మ దీ
ప్తా! యనుఁగార్యమింక గల•దా! యనుఁదానెనలేని వంతచేన్

వ॥ తదనంతరంబ నలుదెసలంబరికించి,

సీ॥ పుత్రుఁడా! జితకాంతి • మిత్రుడా। సౌవర్ణ
గాత్రుఁడా। నీకునే • శత్రునైతిఁ
జూతునా! నిన్నింక • నేతీరుగానైన
బ్రీతిచేఁగనులార • భూతలమున
నందనా! నినుఁబాసి • యుందునా! మహియందు
మందునా! నేనింక • గుందువదలి
కొమరుఁడా! నాపాలి • యమరుఁడా! మాముద్దు
కొమరుఁడా! యనఁదగు • కొమరువాఁ డ!

గీ॥ చేతులారంగఁజేసితి • పాతకంబు
నీతిదప్పితి నే పుత్రి • ఘాతినైతి
భూతలంబున సత్కీర్తి • వొందనైతి
వేయు నేటికి నీకునే • దాయనైతి.

శ్రీ భక్తజన మనోభిరామము.

సీ॥ మోకులంబిగగట్టి • మోకరించుచులాగి
పీకతోగేకలు • వేయువారు,
గోవింద! గోవింద! గోవింద। యనుచును
తేరీడ్చుటకు, ముందు దెరలువారు,
తేరు చక్కియలందు • జేరి బారులుదీరి
బూర గొమ్ములనూది • పొనరువారు,
జయవేంకటాద్రీశ! • జయశేషశైలేశ।
జయదేవ సర్వేశ! • జయతుయనుచు,

గీ॥ సొరిది కరతాళములదట్టి • తిరుగువారు
చెలఁగి హరినామకీర్తనల్ • సేయువారు
గ్రక్కునను శౌరినటగాంచి • మ్రొక్కువారు
మొట్ట మొదలున ముడుపులు • గట్టువారు;

౨

సీ॥ వేత్ర హస్తుల పంక్తి • వేంకటేశుని మ్రోల
బ్రాలి మున్నిడి బరా • బరులు సలుప
భూమీసరోత్తముల్ • వేమరుస్వామికి
వింజామరమ్ములు • వేయుచుండ
సాధ్వీమణులు గూడి • సాగు, యరదముపై
మల్లియల్, మొల్లలు • జల్లువారు
వేల్పు బానిసలెల్ల • చాల్పుగా నిలుచుండి
నతులొనర్పుచు, నర్తనములు సలుప

గీ॥ వేద నాదంబుచే, ద్విజుల్ • విల్లసిలగ
తూర్య నినదంబులమితసం • తోషమొసగ
హారతులనెత్తి రహిజెంది • యబల లలర
వేంకటేశుండు రథమున • వెలుగుచుండె





విద్వాన్, కావ్యతీర్థ

# శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శర్మ గారు

(కవితా సామ్రాజ్యము)

జననము:- 23—8—1900
(శార్వరి శ్రావణ బ॥ ౧౪
గురువారము)

నిర్యాణము:- 2—10—1974

తల్లి :— శ్రీమతి వేంకట సుబ్బమ్మగారు.
తండ్రి :— శ్రీ నృసింహ సిద్ధాంతిగారు
జన్మ స్థలము:- పట్టాభి రామపుర మగ్రహారము (నెల్లూరు జి॥)
మతము-కులము:— హిందూ స్మార్త బ్రాహ్మణులు.

## విద్యాభ్యాసము

కృష్ణయజుర్వేద సంహితతో కొంత. నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకా సింగరబొట్ల పాలెమగ్రహారములో వేదపాఠశాలలో

కావ్యపరిశ్రమః— ఈ మనిలో (గుంటూరు జిల్లా తెనాలి తాలూకా)
నాటకాలంకార సాహిత్యపరిశ్రమః— కడపలో శ్రీకళాప్రపూర్ణ జనమంచి శేషాద్రి శర్మ గారి సన్నిధిలో
సంస్కృతాంధ్ర కవితావ్యాసంగము. స్వయంకృషి కావ్యాభ్యాసమునుండి.

## ప రీ క్ష లు

కావ్యతీర్థ కలకత్తా పరీక్ష 1923
ఉభయభాషాప్రవీణ. బి. ఆంధ్రయూనివర్సిటి. 1930
విద్వాన్. బి. మదరాసుయూనివర్సిటి. 1937

## చే సి న యా త్ర లు.

కాశీయాత్ర1923 – రామేశ్వరయాత్ర1927

## ఉ ద్యో గ ప ద వు లు

చెన్నపురిలో వావిళ్ల ముద్రణాలయములో పండితుఁడుగ – 1924 లో నంద్యాల మునిసిపల్ హైస్కూలులో ప్రధానాంధ్రపండితుఁడుగ (1925–1959) 34 ఏండ్లు. కర్నూలులో సెంట్ జోసప్ గరల్స్‌హైస్కూలులోను, సాంస్క్రిట్ ఓరియంటల్ హైస్కూలులోను ప్రధానాంధ్రపండితుఁడుగ 2ఏండ్లు (1960–1961)

## కు టుం బ చ రి త్ర :-

శ్రీశాస్త్రిగారి ముత్తాత వేదాధ్యాపకుడు; తాత జ్యోతిష్పండితుడు, తండ్రి జ్యోతిష్పండితుడు. పినతండ్రి వ్యాకరణ పండితుడు. వీరిది పండితవంశము కవిగారికి నలుగురు తమ్ములుకలరు. వీరు పెద్ద వారు. వీరికిసంతానములేదు. తమ్ములకు సంతానముకలదు.

## సా హి త్య సే వ.

నంద్యాలయందు వీరు 'కవితా సామ్రాజ్యము'ను నెలకొల్పి గొప్పసాహిత్య సేవనొనర్చిరి. ఆసంస్థద్వారా ఈ క్రింది రచనలను ప్రచురించిరి.

1) సత్యనారాయణ మాహాత్మ్యము—5 ఆ. పద్యకావ్యము 2) అమృతసందేశము-వ్యంగ్యకావ్యము, ప్రతిపద్యము రమణీయము. 3) దైవప్రార్థన - సుభాషితములు, అనుక్షణ పఠనీయములైన పద్యములు, శ్లోకములు 400. 4) కవితావినోదము - ప్రథమ సంపుటము-వినోదకరములైన విషయములు 40, వివరణములతో. 5) పెండ్లి రాయబారము—సీతారాముల కల్యాణము, విపులమైన వివరణముతో. 6) సత్యనారాయణ సుప్రభాతము-టీకాతాత్పర్యములతో, సత్యనారాయణ సుప్రభాతము - మూలము మాత్రము. 7) నిరపరాధ నిందలురావు — నాటకము, గజానన జననము, చంద్రునకు శాపము. 8) త్యాగరాజు—5 అం, నాటకము. 9) భక్తపోతరాజీయము — 5 అం. నాటకము బమ్మెర పోతనామాత్యుని చరిత్ర. 10) మేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రిగారి చరిత్ర 11) కుక్కలమొఱ-కఠిక హృదయములనేని కరగించు పద్యములు. 12) దానకర్ణ బుడ్డా వెంగలరెడ్డిగారి చరిత్ర-వచనము 13) బ్రహ్మస్వామి జీవితము-వచనము.

అయ్యలరాజు నారాయణామాత్యకవి ప్రణీతమైన "హంస వింశతి" అను శృంగార ప్రబంధమునకు టీకా తాత్పర్య వివరణమును,యెనుబది పుటల పీఠికను వ్రాసియున్నారు. వాంఛేశ్వర కవి రచితమగు "మహిషశతకము" నకు తెలుగులో వివరముగా తాత్పర్యము వ్రాసినారు. దక్షిణామూర్తి స్తోత్రమును ఆంధ్రీకరించినారు.

పై మూడు పొత్తములు శ్రీవావిళ్ల వారిచే ప్రచురింపబడినవి. వీరాంధ్ర వచన భారతమును వ్రాసిరి. దానిని ఆర్. వెంకటేశ్వర అండ్ కో, వారు ప్రచురించిరి. వీరాంధ్రీకరించిన 'ప్రియదర్శికా' నాటిక ఆంధ్ర విశ్వ విద్యాలయమువారి పట్ట పరీక్షకు పఠనీయముగ నున్నది. గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారి చమత్కార కవితాఘట్టములను 'చమత్కార కవిత్వ' మనుపేర ప్రచురించిరి.

ఉభయభాషల పాండిత్యము వీరిది. పోతనవలె ధారాశుద్ధి గల కవితనల్ల గలవారు.

సంస్కృతాంధ్ర కవితాసామ్రాజ్యము నేకచ్ఛత్రముగా నేలిన కవిసార్వభౌములు వీరు. వీరి కవితా సామ్రాజ్యము(స్వగృహము)న సాహితీ బంధువులు పాంథులట్లు కొంతతడవు సేద తీర్చు కొని సాహిత్యామృతమును గ్రోలి వెళ్లెడివారు.

కావ్యపరిచయము. అమృత సందేశము—ప్రచురణ 1954.

ఇది యొక్క భిత్తి చిత్రకర్మ. దీని కొక యితివృత్తము లేదు, ఊహా గానము తప్ప.

విభావ సామగ్రిలో కాలచక్రమున ఘటిల్లుచున్న కఱవులు, కాటకములే ఆలంబనము. ఆఁకటిచావులు, అల్లాడిపోయిన యార్త జీవుల కంకాళదృశ్యములే ఉద్దీపనములు.

1941 వ సంవత్సరపు టుత్తరార్థమున ఆంధ్రదేశములోఁ గొన్ని ప్రాంతములను ముంచియెత్తిన వీరక్షామ పరిస్థితులును, 1943లో పత్రికాముఖమున వినవచ్చిన బెంగాల్ రాష్ట్రములోని యాఁకటి చావువార్తలును, ప్రకటించిన ఆ బక్కజీవుల మృత కళేబర దృశ్యములు కవిగారి కావ్యావతరణకు దోహదములు. కఱవు కాటకములను దీర్చు మేఘునిట్లు కవిగారు సంబోధించిరి

ఉ. ఏ మనుకొంటివో జలద! • యిచ్చకు వచ్చినయట్లు చేసి కఱ
వ్రాముఁదలంచితేమొ? యది•పాడమ; వాధ్రియన్నఁగత్తిపై
సాము సుమీ!సమీహితము•చక్కఁగఁదీర్చవలెన్; నియుక్తిరో
గోములుగీములున్దగవు;•గుర్తిడిప్రభుత్వము•హావదేమియున్.

మ. గమనింపం దగు ; నీదురాక యెప్పుడో • గాఢంపముందే ప్రజ
ల్బ్నముహూర్తంబని గౌరవార్థమయి బా• ట్లున్,రిప్పలున్,గడ్డిగా
దము లేరించియు,నిండ్లు వాకిళులు క్రొత్తగ్రల్లేపియున్గాచియు
న్న, మనస్ఫూర్తిగ నాదరించినది యే•నాఁడయ్య? నీప్రభగా!

సీ. నిల్కడగా నిల్చి • నిముసమేన్ గురియవే !
నీయబ్బసొమ్మేమి • పోయెనయ్య?
ఆరీతిఁ గురిసిన • నంతటఁ గురియవే !
నీతాతగంటేమి • నీల్గెనయ్య ?
అంతటఁ గురిసిన • నదను దప్పింతువే !
నీవారిసొత్తేమి • నిలిచెనయ్య?
అదను దప్పించిన • నావలఁ గనరావె !
నీ ముల్లె ముణుపేమి • నీఁగెనయ్య ?

తే. కానవచ్చిన. యట్టులే • కానవత్తు
కురియవచ్చిన యట్టులే • యురిమి మెఱతు
చిట్టచివ కుండఁబోవ ది • క్కటులందు
ఏమి చిత్రవిచిత్రాల • స్వామివయ్య?

'కుక్కలమొఱ' కావ్యమందు తమ భూతదయను అమి
తముగా ప్రకటించిరి. కవిగారి హృదయము వెన్నవంటిది. ఆ
పద్యములను చదువుపాఠకుల, హృదయమువెంత బాధపాయెనను
కఱగకమానదు. 'కుక్కనుజంపిన పాపము గుడిగట్టినాపోదు'ను
నానుడిని వీరు ప్రబోధపఱచిరి. కుక్కలు తమ మొఱలిట్లుమానవ
జాతికి విన్పించినవి.

ఉ. భూత దయాళులార! పరిపూతగుణాకరులార! తండ్రులా
రా! తమ తోడిబిడ్డల కు। రంతపుఁజావును జిత్తగింపరే!
భూతదయాపరత్వమెటు।వోయెనొ। మానవు లయ్యు
మమ్ముఁజే
సేతులఁబట్టి చంపుదురె! చెల్లరె! యింతటి ఘోర మున్నదే!

ఉ. ఇప్పటికింత పుట్టినది ! యింతటితో నిది యాఱిపోవ;దీ
ముప్పునఁ గుక్క లన్ని పరి ।పూర్తిగ నాశన మైనమీఁదవా
తప్పును జేసినట్టి యొక।ద్రాబను బట్టి జగాన మీరుసుం
దప్పుకొనంగఁ జాలుదురె? । దాని నెఱుంగక సంతసింతురే?

మ. ఒక దుష్టాత్ముఁడు చేసినట్టి పని క। య్యో! వానిదోషాన వా
నికులంబే హత మార్చు ధర్మ మెపుడే।నిన్ గల్గెనే? నేఁడు గా
కకటా! నేఁటికి మాకు మూడినది రే । పన్నన్ మఱెవ్వారికెం
తకుఁగానున్నదొ; యిట్టిశాసనమునే। తప్పింపఁగాఁ జూడరా !

ఉ. కుక్కలఁ జంపునంతటన । కుల్కుఁగ నేటికి? రేపుమాపటన్
నక్కలు వచ్చి యూరఁబడి । నన్ దెలియంగల దప్పుడైనమా
యొక్క మహోపకార;మయ।యో! తమరందఱు కన్నులారనొ
క్కొక్కటి చూచికూడ దయ! యుంపక పోయితి, రేమికాలమో!

చ. ఎనిమిదణాల చిల్లరకె ।యించుక త్యాగము సేయఁగల్గుచో
ఘనముగ నొక్క ప్రాణమును గాచినపుణ్యము మీకు దక్కు మీ
రొనరుచు నిట్టి సాయమున।నూపిరి దక్కిన మేము మీఋణం
బును బయిసుంచుకొందుమె? గు।ముల్ గుములై తమసేవసేయమే?

క. ఇప్పటి కీగండంబును, దప్పింపుఁడు ; ముందుమాట ।
తలపోయుద; మొ
క్కప్పుడు ప్రభుపుతె దీనిన్, దప్పింపరె; నాఁటి కొక్క।
దైవములేఁడే!

వీరి భక్తపోతరాజీయము (5 అం-నాటకము) హిందూపురం శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల వారిచే 2వ పుష్పముగా ప్రచురింపబడినది.





కవిభూషణ

## శ్రీ కప్పగల్లు సంజీవమూర్తి

జననము:- 7—2—1894

నిర్యాణము:- 13—6—1962

జన్మస్థలము:- బళ్ళారి జిల్లా-'కప్పగల్లు' గ్రామము.

తండ్రి:- శ్రీకరణం: భీమరావుగారు

తల్లిపేరు:- మల్లమ్మగారు

మతము:- } హిందూ-బ్రాహ్మణ-మధ్వ-గౌతమ గోత్రం.
కులము:- }

విద్యాభ్యాసము:- S.S.L.C. (మద్రాసు) సెకెండరీగ్రేడు

ఉద్యోగము:- మునిసిపల్ హైస్కూలులో ఉపాధ్యాయవృత్తి.

కుటుంబ విశేషములు:- కరణీక కుటుంబము. మధ్యతరగతికి చెందినవారు.

## ముద్రితగ్రంథములు;

1) మేఘప్రతి సందేశము (ప్ర: 1937) 2) మయూరధ్వజ చరిత్రము. 3) శ్రీవరసిద్ధి వినాయక స్తవము (ప్ర: 1958) 4) వంశము. 5) గీతాసుధాసారము 6) నవ్యగాథాలహరి. 7) ఒక శరద్రాత్రి అది 8) వేణువు 9) అహల్య(ద్విపద) 10) ద్రౌపదీమానసంరక్షణ. 11) కీ.శే.కోలాచలం శ్రీనివాసరావు గారి సంగ్రహ జీవితము-గద్యము. 12) కీ. శే. ధర్మవరం రామకృష్ణమాచార్యుల జీవిత సంగ్రహము. (గద్యపద్యములు ప్ర: 1956) 13) బళ్ళారి మునిసిపల్ హైస్కూల్ చరిత్ర (గేయము ప్ర: 1954)

### అముద్రితములు.

1) భారతనారిధన్య 2) సుమకరండము (పద్యములు) 3) విజయాభిమన్యు (నాటక) 4) మయూరధ్వజ (నాటక) 5) శివాజి (నాటక) 6) భక్తసుధన్వ (కన్నడనాటకం) 7) గయోపాఖ్యాన (నాటక) 8) గీతాసుధాసార (కన్నడ) 9) వేనుడు (నాటకముతెనుగు) 10) రుక్మిణీ కల్యాణము 11) కృష్ణరాయబారము.

### కావ్యపరిచయం:

## మేఘప్రతిసందేశము:

మహాకవి కాళిదాసకృతమగు మేఘసందేశ కావ్యమునందుఁ జెప్పఁబడిన యక్ష సంధేశవచనములకు నతనిభార్య యొసఁగిన

యనురూప ప్రతివచనములే ప్రతిసందేశకావ్యము. ఈ ప్రతి సందేశ కావ్యమును గీర్వాణభాషయందు మైసూరు మహారాజాస్థానవిద్వత్కవిరత్నమగు బ్రహ్మశ్రీ మండికల్-రామాశాస్త్రి గారిచే రచింపఁబడినది. ఆ శ్లోకములను వృత్తములతో నాంధ్రమున శ్రీరావాడ వేంకటరామశాస్త్రిగారు ననువదించిరి.ఆవృత్తముల నొక్కొక్కటిని రెండేసిగీతములుగ శ్రీకప్పగల్లుసంజీవమూర్తిగారు నాంధ్రీకరించిరి. విపులమగు విషయమును సంగ్రహించు కార్యము రావాడ వారొనర్చగా, సంకుచిత విషయమును వెల్తిగాకుండ విశదీకరించుపని కప్పగల్లు వారొనర్చిధన్యులైరి. కాళిదాసుని మేఘసందేశమువలె నిదియు సర్గద్వయాత్మకమే; మందాక్రాంతావృత్తయుతమే. కవి, విరహతాపభర పరీతస్వాంతులగు యక్షదంపతుల నొకచోఁజేర్చి ధన్యులైరి.

ఈ కావ్యము అనంతపురం జిల్లా ఉరవకొండ యందలి మారుతీ గ్రంథమండలి వారిచే ప్రచురింపబడినది.

గీ. ఆర్తబాంధవ-యోపయోదా! యిదేల
ప్రియుని శుభవార్తపలు మాఱు వినియునిట్లు
మాటిమాటికి నడుగు నీ మగువయనుచు
విసుగుగొనఁబోక-కరుణింపవేడుదాన! ౧.

గీ. ఏటికన, లోకమునఁదమునెడసి చనిన
ప్రియులకై, యజస్రము కుందు విరహిణులకుఁ
దత్ప్రియవార్త-మఱిమఱి తవిలి వినుట
కంటె,వేఱొంటనూరట—కలుగఁగలదె! ౨.

గీ. దూరగతుఁడగు నాదయితుండు సతము
మందభాగ్యనౌ, నాకయి మమతగూరి
క్లాంతచిత్తుఁడైకడుదీన గతిఘటింప
నడలుచెట్లంగి దినములఁగడపువాఁడొ? ౩

గీ. జలధరా! నాయొనర్చు విజ్ఞాపనంబు
నాధునకుఁ దెల్పి నీ సుజనత్వగరిమ
చాటుమని మాటిమాటికంజలి ఘటించి
దీననై, మనసారఁ బ్రార్థించుదాన.

...... ...... ...... ...... ......
...... ...... ...... ...... ......

గీ. విరహతాపోష్ణ, ముపశాంతిఁ బొందయుకొఱకు
నరవిరుల సెజ్జ, లేఁత తామరలసెజ్జఁ
జలువ రాసెజ్జఁగాయంబు జాఱవిడితిఁ
జందనాదిక సకల చర్చలనుగొనితి;

గీ. అయిన హృదయ మొక్కటను జల్లారదయ్యె;
నరసిచూడ, నీవిరహ సూర్యాతపంబు
వసుధ యందలి శీతలత్వంబునెల్ల
నొక్కసారియె హరియించి యుండఁబోలు

శ్రీవరసిద్ధి వినాయకస్తవము

ఉ. పొట్టిగ నున్నసేమి? కడుపుల్ గనుఁడుబ్బిన దెల్లవిద్యలుల్
గుట్టుగ, సందెడాఁగె, నవిగో! వినలేదొకొ? 'పొట్టివానికిన్
పుట్టెడుబుద్ధు' లన్ననుడి మున్నను కొంచును భక్తిబాలురే
దిట్టనివిద్యకై, కడునుతింతురెః యాతడు, మమ్ముఁ బ్రోచుతన్

ఉ. తెల్లనిగట్టుకాపురము, తెల్లనిగిత్తసికంబు, తానునున్
దెల్లనిసామి, యాదలకుఁ దెల్లనిగంగ, రుమాలు, సొమ్ములున్
దెల్లని పాఁపపేరులును-దెల్లని క్రొన్నెల; యట్టిశూలికిన్
నల్లని-కాశి, యాలనుచు, నవ్వు వినాయకుఁడేలు మమ్ములన్

ఉ. పొంగెడు భక్తితోఁ దనువుల్ పులకింప, ముదశ్రులూర, సా
ష్టాంగ నమస్కృతుల్ వెలయఁ బ్రార్థనసల్పెడు, మామనంబులు
పొంగఁగ, సర్వమంగళకుఁ బుత్రుఁడవౌటది, సార్థకంబుగా
మంగళమూర్తిమా కెపుడు, మంగళముల్, సమకూర్చుచుండుమా.

కవిగారీ కృతిని శ్రీయుతులు అప్పకాయ సూర్యనారాయణ శాస్త్రులగారి ప్రోత్సాహమున తెనిగించిరి. కవిగారెటింగి నంతవఱకు దాదాపువారు అర్ధశతమానమునుండి ప్రతిసంవత్సరము శ్రీ విఘ్నేశ్వర పూజామహోత్సవమును బరమభక్తి పురస్సరముగను, మిగుల విజృంభణముగను జరుపుచుండిరి. ఆసందర్భములందు శ్రీగణాధిపునిమీద శ్లోకములనో, పద్యములనో రచింపఁజేసి, యచ్చువేయించి వాటిని భక్తులకు బంచిపెట్టుచుండిరి. ఆ అవకాశము శ్రీ సంజీవమూర్తిగారికి ప్రతియేడు లభించినది. ఆ కృషియే యిట్లు శతక రూపమున వెలసినది. దీనిని ప్రోత్సహించిన శ్రీ శాస్త్రుల వారే ముద్రించిరి. కవిగారి మిత్రులైన శ్రీరావాడ వేంకటరామ శాస్త్రిగారీ పొత్తముపై చక్కని యభిప్రాయమును వ్రాసిరి.

కరి "నభవుండు" ద్రుంప, 'హరి' కాచుట తెల్పిభవాని నవ్వుచున్
"గరివదనుండు" వీవిట నీఁకన్ వసియింపకు; శౌరి పజ్జకున్
దరలు" మటన్నఁ "బుట్టని యతండు విధించునె? సింగమోమునే
కరి" నని మాఱుపల్కి నగు గౌరితనూభవుఁడేలు మమ్ములన్.

ఈ పద్యములో గౌరి గణేశుని గాంచి లోకసామాన్య రీతిగ " నాయనా, నీవిట్టివాడు, నీ తండ్రియట్టివాడు, మీమామ యొద్ద కుఁబొమ్ము' అనుట యందఱి తల్లులు తమబిడ్డలతో ముచ్చటగ నను కొనుచుండు సామాన్యోక్తి. దీనిని కవి యెంతముచ్చటగఁ జిత్రించి నాడో ఆయావ్యక్తుల పూర్వగాథల నాకళించుకొన్నఁ, దెల్లమగును.

(శ్రీరావాడ)

వీరి రచనలెన్నియో అముద్రితములున్నవి. వానిలో నవ్య గాథాలహరి ఒకటి. అదిగాథాసప్తశతికి సరితూగురచనయనిపించు చున్నదని శ్రీ భాస్కరాచార్య రామచంద్రస్వామిగారు తమ అమూల్యాభిప్రాయమును వెల్లడించిరి. అది ముద్రింపబడుట మన యదృష్టము. వీరికి బళ్ళారియందలి ప్రసిద్ధ కవిరత్నములతో చెలిమి కలదు. ఆంధ్రకన్నడ భాషామ తల్లుల అనుంగు బిడ్డగావీరు వెలుగొందుట మన సీమకొక భాగ్యవిశేషము.

---



## శతావధాని గాడేపల్లి వీర రాఘవ శాస్త్రి

జననము:— 30–4–1891

మరణము:— 5–3–1945

జన్మస్థలము:— కర్నూలు జిల్లా— మార్కాపురం తా॥ ఎఱ్ఱగొండ పాలెము.

తల్లి : శ్రీమతి సుబ్బమ్మ
తండ్రి : శ్రీ శివరామ దీక్షితులు.
మతము-కులము:— తెలగాణ్య వైదీకశాఖకు చెందిన బ్రాహ్మణులు

### విద్యాభ్యాసము.

వీరు ౧౧వయేట బ్రహ్మోపదేశమైన తర్వాత తండ్రిగారి యొద్దనే స్మార్తభాగములో, షోడశకర్మలును, యజుర్వేదములో సంహిత, అరుణపంచకము, ఉపనిషత్పంచకము, అవసరమైన, శ్రౌతభాగము వల్లించిరి.

## సా హి త్య ప ఠ న ము.

౧౬వయేట బ్రహ్మ శ్రీ మేడవరము సుబ్రహ్మణ్య శాస్త్రుల వారియొద్ద కావ్యపాఠ మారంభించిరి. నాటకాలంకార సాహిత్య గ్రంథములు పూర్తి చేసిరి. 3 సంవత్సరములు గురుకుల వాసమొనర్చిరి. కవిత్వము స్వయ ముద్భవమైనది. కావ్యపఠనము తోనే అవధానశక్తి ఆవిర్భవించెను.

## కు టుం బ చ రి త్ర:—

వీరితండ్రిగారు శివరామదీక్షితులు. అవిచ్ఛిన్నముగా, అగ్నిహోత్రము లుంచుకొన్న అతిదీక్షాపరతంత్రుడైన కర్మఠుడు. వీరు సాక్షాత్తు వేదపర్వతమని, ఋషియని, బాగుగా జదువుకొన్న వారని, మంచి సదాచార సంపత్తిగలవారని, నిత్య తృప్తులని, నిరతాన్న ప్రదాతలని. నిత్యాగ్ని హోత్రులని, అందఱి కును, ఎంతో గౌరవము.

వీరి తల్లిగారు శ్రీమతి సుబ్బమ్మగారు. పతిభక్తి కలది. సంసారములో సర్దుబాటు, సహన భావము, వచ్చిపోవువారి యెడఁ జూపు ఆదరాతిశయము, విశేషముగా గల్గిన దీమె.

శ్రీ శివరామ దీక్షితులు డెబ్బది యేండ్ల పూర్ణాయుర్దాయ ముతో, పరమ పదించిరి. తల్లి సుబ్బమ్మగారు చనిపోవునప్పటికి శ్రీ వీరరాఘవశాస్త్రిగారికి 43 సంవత్సరములు.

వీరి కిద్దరు జ్యేష్ఠ సోదరులుండిరి. 1) పెదకోటావధానులు 2) చినకోటావ ధానులు. వీరిద్దఱు తండ్రి మరణానంతర మచిర కాలములోనే గతించిరి.

## వి వా హ ము :-

శ్రీ వీరరాఘవశాస్త్రిగారికి ద్వికళత్ర యోగము పట్టినది. మొదటి భార్య రెండేండ్లు కాపురమొనర్చి గతించెను. ద్వితీయ కళత్రమునకు ఒక కొమార్తెయు, నొక కొమారుడు నున్నారు. (పోయినవారు పోగా)

## సా హి త్య సే వ :—

వీరు గొప్ప కవీశ్వరులు. అనేక సామాన్యమైన అగణిత ప్రతిభగల ఆధునిక కవులలో, అగ్రగణ్యులు. అసాధారణమైన ప్రతిభ, అనుపమానమైన ధోరణి, ఉదాత్తమైనధార, ఉచ్ఛృంఖల మైన ఊహ, ఉత్తేజనకరమైనవాక్కు, ఇవి వీరికి భగవత్ప్రసా దితములైన, లోకోత్తర గుణములు, ఇన్నిటిని మించినది, ఆ కారదైర్ఘ్యము. ఆకారదైర్ఘ్యము. నధఃకరించినది, దీర్ఘసమాస సంఘటనము. పిడుగుకి కంపలేని గుండె; వీర ధైర్యము; రాతిబొమ్మ లకు చక్కిలిగింతలు పెట్టుచమత్కార సంభాషణము, సమయస్ఫూర్తి ఏకసంధాగ్రహణశక్తి - ఇవివీరికి సహజగుణములు.చదివిన దల్పము సాధించిన, దధికము, 'ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః'

## ము ద్రి త గ్ర ం థ ము లు.

1) చమత్కార కవిత్వము 2) త్రిపురాంతక స్థల మాహాత్మ్యము (3-ఆ) 3) శ్రీ సత్యవరలక్ష్మి ధ్రువచరిత్ర (ప్ర: 1941) 4) అహోబల మాహాత్మ్యము (5—ఆ) 5) మార్కండేయ చరిత్రము (హరికథ)

శ త క ము లు.

1) రామభూపతి శతకము 2) దీన కల్పద్రుమ శతకము
3) విశ్వేశ్వర శతకము 4) సోమేశ్వర శతకము
5) చెన్నకేశవ శతకము

ఇ త ర ర చ న లు:-

1) ఆర్యవిద్యా ప్రబోధిని 2) ద్విపద భగవద్గీత
3) ముకుందమాల (ఆంధ్రీకరణము) 4) పింగళ హరికథ

అ ము ద్రి త ము లు :—

1) సాంబలక్షణ (3 ఆ-శృంగార కావ్యము) 2) హైమవతీ పరిణయము 3) భూగంగాస్తుతి 4) మార్కండేయనాటకము 5) సీతాకల్యాణము (ద్విపద) 6) సీతారామ కల్పద్రుమ శతకము 7) వెంకటేశ్వర శతకము 8) కుమార సుబ్రహ్మణ్య చరిత్ర 9) మెదకు సంస్థానాధీశుల చరిత్ర (వచనము)
10) హరివంశము (వచనము- అసంపూర్ణము)
11) ఐరావత వ్రతకథ (వచనము)

ఈ గ్రంథములేగాక, యింకను వ్రాసిన వెన్నియో యున్నట్లు శ్రీ శాస్త్రిగారే వ్రాసిన ఈ క్రింది పద్యమువలనఁ దెలియనగును.

సీ. మసిపాతకన్నను - పసిదప్పి ముద్రిణ
కుద్రేక ముడిగిన వ్రాక్కుకొన్ని
జీర్ణపత్రములలో జీర్ణించి, క్రిములచే
దష్టంబులైన, పొత్తములుకొన్ని,
ఆశువు లందంద-హ్రాస్వమయ్యును, జిక్కి-
యున్నవి వేనవే లొక్కకొన్ని,

పత్రి కాంగనలలోఁ బ్రచురణ కనియేగి
చెరి సగ మౌచు, నిల్చినవికొన్ని,

గీ. హరిహరీ! వీరరాఘవ - వరకవీంద్రు
సరస రచనా నితంబినుల్ - సభలఁ బ్రభుల
నయన హస్తావలగ్నలై - నాట్యమాడు
సమయ మేనాటికో యనుజా! యెఱుంగ.

అని, 1940లో తమస్నేహితులకు ఈ పై పద్యములు వ్రాసియున్నారు.

## కావ్యపరిచయము

### చమత్కార కవిత్వము

ఈ కావ్యమును శ్రీవిద్వాన్ కావ్యతీర్థ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు, గద్వాల యువకవి విజ్ఞాన సమితి ద్వారా ప్రచురించిరి.

—చమత్కార కవిత్వములోని కొన్ని పద్యములు—
( చాటువులు )

ఉ: తుమ్మలపల్లి కామయ సుతుండు, వితంతులఁగేశయుక్తలన్
రమ్మని కౌగిలించి, యధరంబును జుంబన మాచరించి,దో
సమ్మని యెంచకే రతుల సంతస మందుచు నుండు, నిట్టికా
ర్యమ్ములు వీరిపూర్వు లెవరైన నెఱింగిరె?యెంచి చూడఁగన్

ఉ. గుప్పున మంచి వాసనలు గుప్పెడి పాటిపొగాకు నిప్పునన్
జొప్పడఁగాచి, గోఘృతము సున్నము గూర్చి,పురాణవేళలన్
దప్పక నశ్యమిచ్చు నిరతంబు బుధాళికి; గాడెపల్లికో
టప్పకుఁగల్గు భూజ కలశార్ణవ కర్ణులు సాటివత్తురే?

దైవము దిన్నె (కర్నూల్ జిల్లా) రామారెడ్డిగారి స్థానములో రాఘవ శాస్త్రి గారి కొక గొప్ప గౌరవ స్థానముగలదు. అడిగిన దాని కనుకూలమైన సమాధానము పద్యములలోనే చెప్పుదురు గనుక, రాఘవశాస్త్రి గారితో, వినోదకాలక్షేపములు జరుగు చుండును. అక్షయసంవత్సర, వసంత నవరాత్రోత్సవములకు రెడ్డి గారింటికి, మదరాసునుండి బంధువులు వచ్చియుండి, రాఘవశాస్త్రి గారితో పెద్దన తన కవిత్వమును గుఱించి మాలిక చెప్పి కొని యుండెఁగదా! మీకవిత్వమును గుఱించి మీరేమైన మాలిక చెప్పఁ గలరా? యనివినోదముగ నడిగిరఁట, అపుడు అశ్వాశువు వ్రాసికొనుఁడని.

చం. సరిదసమాన వేగమునఁజక్కని చిక్కని ధారతోడ,నీ
సరసులు వహ్వారే! యన, రసప్రసర ప్రచుర ప్రవాహముల్
దరులకుఁ బొంగిపొర్ల,మిగులన్ గురియింపవె,పద్య వృష్టినో
పరమదయాప యోనిధి! సభాజన వశ్యకరీ! మహేశ్వరీ!

అని ప్రార్థించి,84చరణములుగల ఉత్పలమాలికను ఆశువుగాచెప్పిరి.

ఉత్పలమాలిక
(84 చరణములలో 16 మాత్రము)

శ్రీ రమణీయులార ! సరసీరుహ నిర్య దమంద మాధురీ
సార వచస్కులార ! విలసత్కమనీయ యశో విలాసినీ
హారి విహారులార ! పర మాదుర మేదుర చిత్తులార! ఓ
సూరి వరేణ్యులార ! పరిశుద్ధ వచోరచనాచమత్క్రియా

సార రసానుభావ, గుణసార సమంచిత వృత్తరీతి,వి
స్తార మదీయ దివ్య కవితావనితాభి రతిప్రసక్తి సం
స్కారము లిందుఁ జూపుటకుఁగా నిదె కోరితి;రేను బూనితిన్;
ధోరణి విన్నచోఁ—గనక తోయజ కాండ వినిస్సర దృసా

సారమయ ప్రవాహరుచి సారెకు సారెకుఁదోఁచు-; నల్లికల్
గూరుచుచో-వసంత నవ కోమల పల్లవ వేల్ల దుల్లతా
గార నిరంతరాయ పరికల్పన సుల్లస మాడు-; వ్యంగ్యపు
స్ఫారపుఁజూప నెంచ-రమణీయ మహోజ్జ్వల యౌవన ప్రభా

చారు విలాస సంభరణ సారసపాణి విలాస వాక్చమ
త్కార విశేష వైఖరులు కన్నులఁ గట్టినయట్ల తోఁచు-;నో
రూరఁగఁ జేయు మత్కవిత నూఁకొను భాగ్యము గల్గినంత-శృం
గార రసానుభావ పరికల్పిత యౌవన ఘూర్ణమాన సం

....... . ....... ... ...... . . .... ...... ..

...... . ... ...... .... . . .. .. .

అని గడగడ చెప్పి వేసిరఁట. ఇట్టి కవితాధార మనసీమ కవులకే కలదని వీరరాఘవ శాస్త్రిగారు చాటిచెప్పిరి. తెనుగు తల్లికి దివ్యాలంకార భూషితమగు ఉత్పలమాలిక నందించిన ఘనత పెద్దన్న తరువాత వీరికే దక్కినది.





## శ్రీ భాస్కరాచార్య రామచంద్ర స్వామి

జననము:- 1905

నిర్యాణము:- 25—6—1965

జన్మస్థలము:- బళ్ళారిపట్టణము.

తండ్రి:- శ్రీ పట్టాభి రామస్వామి గారు.

తల్లి :— నాగలక్ష్మాంబ

మతము;కులము:- హిందూ—బ్రాహ్మణ గౌతమస గోత్రులు.

విద్యాభ్యాసము:-

కవిగారు బళ్ళారిలో, గీర్వాణాంధ్రములనధ్యయనము చేసిన తరువాత, విజయనగర మందలి సంస్కృత కళాశాలలో చేరి, అయిదేండ్లపాటు కావ్య నాటక సాహిత్యములను, అధ్యయనము చేసిరి. స్వయం కృషితో, వారు పెక్కు భాషలతో పరిచయము సంపాదించుకొనిరి. ఇరువదేండ్ల ప్రాయముననే, గీర్వాణాంధ్రములందు పాండిత్యముతో పాటు, జ్యోతిష వైద్యమంత్ర శాస్త్రము లందు నిష్ణాతులైరి. సృష్టిక్రమము, తంత్రశాస్త్రము, వీటిపై ప్రగాఢ పరిశోధన సల్పిరి.

కుటుంబ చరిత్ర:-

వీరి తల్లిదండ్రులకు, ఈ కవిగారొక్కరే కుమారులు బళ్ళారికి చెందిన, భాస్కరాచార్య పరంపరా పీఠమునకు, అధ్యక్షులైన శ్రీ పట్టాభిరామస్వామి గారికి, వీరు దత్తపుత్రులు. కవిగారి భార్యఅంబమ్మ. ఈమె అన్నపూర్ణాదేవి వంటిది. వీరికి ఇద్దరుకుమార్తెలు, ఒక కొడుకు గలరు. కుమారుడుశ్రీ టి. బి. రామమూర్తి. బి.ఏ ఆనర్సు-ఆంగ్లభాషోపన్యాసకులుగా, నెల్లూరు వెంకటగిరి రాజా కళాశాలయందు, పనిచేయుచున్నారు. మొదటి కుమార్తె కమలమ్మ, రెండవ కుమార్తె స్వర్ణమ్మ.

సాహిత్యసేవ:—

వీరు సంస్కృత శాకుంతల నాటకమును, యథాతథముగ ఆంధ్రమున కనువదించి యున్నారు. కాని యిది యింకనూ అముద్రితము. తర్వాత వీరి సర్వాంగ సుందర మగురచన 'యాత్రికుడు' అను ముద్రిత ఖండకావ్యము. యాత్రికుననుపద్యకావ్యము, కన్నడము, ఇంగ్లీషు, మొదలగు భాషలలో అనువదింపబడినది. ఒకానొకరు నీ 'యాత్రికు'ననుపద్యకావ్యముపై ఇంగ్లీషునందు, అరువది పేజీల విమర్శను వ్రాసినారనియు, విమర్శనాగ్రంథము కూడా, ముద్రితమై యున్నదనియు వినికిడి.

అభిజ్ఞాన, శాకుంత లాంధ్రీకరణము భాషాంతరీకరణమగుటచే రస, పాక, శయ్యాలంకారాదులు, వెలుగు నోజస్సు ప్రతిబింబింప జేయుటకు బాగ్రబంధసంచితములును గలిగి, ఈ జనన మందు, అధికతరాభ్యాసముండవలెనని, శ్రీ వారే ఒకచోట పలికినారు. ఈ క్లిష్టతరకార్యమును కొనసాగించి, యశస్సు సంపాదించినారు మన రామచంద్రస్వామి గారు.

గుణగణములు:-

శ్రీవారు తమ యౌవనమున సిరిసంపదలతోఁగూడి యుండు తమ గృహమును, నయనానందకరంబై, అనిందితమై, నానా సద్విజశ్రేణి కాశ్రియమై, ధర్మసత్రముగజేసి యుండిరనియు, కవి, గాయక, యాచక బృంధముల కనేక విధముల తోడ్పడి, యుండిరనియు వారి మిత్రులు, ఆశ్రితులు వీరి నిప్పటికినీ బొగడు చుందురు. వీరి వార్ధక్యమున పూర్వపు టౌన్నత్యముగాని, సంపత్తు గాని యుండలేదు. కాని వారు నిరుత్సాపడలేదు. మిత్రులయెడ, నీతనికి గల మమత, యపారము. సరస సత్కవి కావ్యసరణి వినోదించు వారీతని నాశ్రయించి యుండిరి.

ఇతడు ఖండితవాది. రసికుడు. సుజన ప్రాణుడు. కవితా నిధానుడు. ఇతనిచే రచింపబడ్డ నీ క్రింది పద్యమును పఠించిన, ఈతడెట్టివాడో నిరూపించుకో వచ్చును.

ఉ॥ "లావును తావుగానని, గులాముఁ కొగ్గి, సలాముఁజేసి,సం
భావన నొందు కాంక్షమతిఁబట్టక, జీవన రీతులొత్తు,ని
త్యావసరాల నేకొలది యైనను దీర్చుకొనంగఁగాక నే
దోవగ గాలమున్ వెడలఁ ద్రోయుచునుంటి విధివ్యథావధిన్"

శ్రీ భాస్కరాచార్య రామచంద్రస్వామి సంస్కృతాంధ్రము లలో గొప్ప పండితులు. కన్నడ, మళయాల, తమిళ, హిందీ, బెంగాలీ భాషల పరిచయము కలవారు. విశాల హృదయులు, కులమత, వర్గ, భాషా వైషమ్యములు లేనివారు,

రచించిన కృతులు:-

1) శాకుంతల యాంధ్రీకరణము 2) బాటసారి 3) మాహాంపి 4) యాత్రికుడు.

శాకుంతలలో శకుంతల సౌందర్య వర్ణనము.

చం॥పరిమళ మానసట్టి ప్రసవంబు: నఖమ్ములు సోకనట్టి సుం
దరమగు పల్లవమ్ము; రతనమ్మున విద్ధము, కోర్కిల్పులేని క్రొ
వ్విరిసునుదేనె; పుణ్యపదవీ పరిపూర్ణ ఫలమ్మునై, యఘం
బెరుగని దామెరూపు, విధి, యెవ్వని భోక్తనొనర్చునే మొకో!

యాత్రికుఁడు

ఇది కవిగారి స్వతంత్రకృతి. అనుభూతికందిన విషయాలను పాడుకొన్న కవమ్మని గీతములే యాత్రికుడు. ఇందలి నలుబది గీతములను కన్నడ భాషలోనికి శ్రీ కె. జోశదరాసి దొడ్డవగౌడు గారు అనువదించిరి.

౧

గీ. ఎన్నఁడీ యాత్రికు మొదలో, ఎపుడు తుదియొ?
బ్రతుకు నాల్గు దినమ్ముల-పాంథశాల
రస మిగిరి పోవ, శక్తి నీరసత నొందుఁ
బాత్ర మున్నంత నింపుము ప్రాత మధువు.

౨

గీ. విందు వలదు — కపూరంపు — విడెము వలదు
వలదు, కనకాభిషేక సంభావనలును
అంద అనుభవమునకు, నానందమొకఁడె
పంచిపెట్టుము — త్రావుము — ప్రాత మధువు.

౩

గీ. జ్యోతి నెగదోర్చియు మోయీ ! విశుద్ధ హృదయః
స్నేహ మున్నంతవరకె - నీచేతలెల్ల
ఆరి పోవకమునుపె - నీపరయు పెల్ల
ఆత్మ జ్యోతి రగుల్చు - స్నేహమయుఁడీవు!

౪

ఆ.వె. ఆఁట వెలఁది ముద్దు - తేటగీతాలలో
నాత్మవాణి - నాగృహాంగణమున
గొదమ వయసు మిసమి—కొసర, సుమించిన
కొమ్మనీడఁ బాడు – కొందుఁగాక !

౫

గీ. మధువునను - మోజువరచెడు – మదము కలదు
మదమునకు, సోలుగుణము - తుమ్మెదకు గలదు
మధుపమునను రసగ్రాహ – మహిమ కలదు
సాజ మిది, రసోపాసకాచార్యులకును.

౬

ఆ.వె. బ్రతుకు నీఁటిబుగ - పగిలు పోవక పోదు
పగిలెనేని, నాద్య భావమొందు;
నాద్యభావ మంద – నంత విశ్వమనంత
విశ్వ మంద నంత విభుఁడు పడఁతి.





శారదాపుత్ర. విద్వాన్.

# పి. వెంకటరెడ్డి గారు

ప్రొద్దుటూరు.

జననము:— 1-7-1922

జన్మస్థలము:-పర్లపాడు గ్రామము ప్రొద్దుటూరు తా॥ కడప జిల్లా

తల్లి:— రామాంబ (రామక్క)
తండ్రి:— బాలిరెడ్డిగారు.
మతము,కులము:- హిందూ, పల్లెకశిరెడ్డి

విద్యాభ్యాసము వగైరా:-

తెలుగు విద్వాన్ (బి) "శారదాపుత్ర" బిరుదము.

సంగ్రహ కుటుంబ చరిత్ర:

వీరికి గోవిందరెడ్డి, వెంకటరెడ్డి యను యిరువురన్నగారును యిరువుర క్కగారును కలరు. వీరి కులవృత్తి వ్యవసాయము. వీరు ప్రాథమిక పాఠశాలలో 12ఏండ్లవయసున ప్రవేశించి. నాలుగైదు తరగతుల వరకు మాత్రమే చదివిరి.

వీరి స్వగ్రామస్థులును, గురుతుల్యులునగు శ్రీ విద్వాన్ జీరెడ్డి చెన్నారెడ్డి (ఎం. ఏ. బి. ఇ. డి.) గారు వీరి కవితాభ్యాస

మునకు మార్గదర్శకులగుటయే కాక కవిగారి సున్నత విద్యా భ్యాసమునకు ప్రోత్సహించి వారి యింటి యందే అన్ని సౌకర్య ములను కలిగించిరి. 'విద్వాన్' పరీక్ష చదివించి కవిగారి జీవనో పాధికి బునాదివేసిరి. కవిగారి గురువులు ప్రస్తుతము తిరుపతి శ్రీవేంకటేశ్వర విశ్వ విద్యాలయమున నాంధ్రశాఖలో బని చేయు చున్నారు.

## సాహిత్య ప్రవేశము:-

స్వగ్రామస్థులైన కీ. శే. 'కవిరత్న' చెమిరెల చెన్నారెడ్డి గారు 'చెన్న రామాయణమును ' కీ. శే. ' బాలకవి ' పశిరెడ్డి వేంకట సుబ్బారెడ్డి గారు (బనగానపల్లె సంస్థానాస్థాన కవులు) 'బాలరామాయణము'ను రచించుట జేసి కవిగారును రామాయణ కావ్య రచన మొనరింప కుతూహలురై 'శ్రీమాన్ నిర్వచన వేంకట రామాయణ ' మనుపేర రమారమి మూడువేలపద్యములతో రామాయణమును వ్రాసిరి. అది యింకనూ ముద్రణ భాగ్యమును నోచుకొనలేదు.

కవిగారు ప్రొద్దుటూరునందలి ఓరియంటలు హైస్కూలు నందు తెలుగు పండితులుగా పనిచేయుచున్నారు.

## వ్రాసిన కృతులు:—

1) బకాసుర వధ 2) గాంధీస్తుతి గీతములు. 3) వీరభద్రస్వామి పద్యరత్నమాల 4) శ్రీమాన్ నిర్వచనవేంకటరామాయణము (అముద్రితము) 5) పారిజాతాపహరణ నాటకము (ముద్రణము)

పారిజాతాపహరణ నాటక మందలి మధుర ఘట్టములోకొన్ని

నారదుడు:-

చం॥ వినుము! లతాంగి! మాటలికవేయుననేటికి నెంచిచూడ నీ
పెనిమిటి నీవు నిక్కముగ భీష్మకనందన కాలిగోటికై
నను మఱిసాటిరావని మనంబునఁ దాఁదలపోసియుండు నే
ననుటయకాదు సుమ్మతనియాశయమట్టిద, చేష్టయట్టిదా!

సత్యా:

[కోపముతో] నారదా! నేనిఁకవినఁజాలను [అని చెవులుమూసుకొని]
కర్ణ శూలములైన యీ పలుకులు ముమ్మాటికి వినఁజాలను.

ఉ॥ చెప్పకుమయ్య! కృష్ణు చెఱుచేఁతలు నాకిఁకఁ దచ్చరిత్రమా
విప్పకుమయ్య! పేరలుక పెంపకు, ముంపకు దైన్యవార్ధిలోఁ
దప్పిదమెల్ల నాయదియె తామరనేత్రుఁ నట్లు స్వేచ్ఛగాఁ
ద్రిప్పటఁజేసి నాకిటులఁ దిప్పలు కల్గెను సంయమీశ్వరా!

నారదుఁడు: సత్యాదేవీ! యీ విషయము నీకెఱిఁగించి యుపకారము
చేయుటకై వచ్చితిని.

సత్యా: స్వామీ! నాకుపకారము చేయుటకై వచ్చినవారు పుష్పము
నాకొసఁగక యా జనార్దనునకేల మోసికొనిపోయి సమర్పించితిరి

నారదుఁడు:

అమ్మా! నీ భర్త నీయందు బద్ధానురాగుడనియు నీకేయిచ్చు
ననియుఁ దలపోసి పుష్పమాతనికిచ్చితిని. తానొక్కటి దలఁచిన
దైవమొక్కటి తలఁచెనన్నట్లు నీకు మేఱుచేయు తలఁపుతో రాగాఁ
గీడుగా పరిణమించినది. దానికెవరేమి చేయుదురు? మనంబున
నూరడిల్లుము. శాంతము వహింపుము.

సత్య :—

ఆర్యా! నాకీయవమానాగ్ని యెట్లు చల్లారును? అగ్నిసాక్షిగాఁ బెండ్లాడిన నా భర్తయే నాకిట్లవమానము ఘటిల్లఁజేసినాదన్న సహింపచ్చునా? నన్నవమానించుట తన్నవమానించు కొనుటకదా? పోనిమ్ము! నన్నిట్లు వంచించుటకు నేనా హరికి నేమి యపరాధము చేసియుంటిని? పువ్వొసఁగి రుక్మిణినంత గౌరవించుటకామె చేసిన మేలేమిగలదు? నిర్హేతుకముగా నింత నిర్దాక్షిణ్యమేల కలుగవలయును?

నారదుఁడు :—

సాత్రాజితీదేవీ! యేమి చేయవలయును? రోజులు మారుచున్నవి. వానితోఁబాటు గొప్పవారిబుద్ధులు సైతము మారిపోవుచున్నవి. కలికాలమాసన్నమగుకొలఁది ప్రపంచమే తల్లిదల్లగును. లేకపోయిన నిన్నమొన్న ప్రేమించిన కృష్ణుఁడు నేఁడేల నిన్ను తేలికగాఁజూచును?

సత్య:—

ఋషీశ్వరా! అదియట్లుండె. నావెన్నుఁడు నేఁజేసిన యుపకృతులైనను దల పెట్టవలదా?

సీ॥ నరకాసురునిఁ జంపు నాఁడాజిలో నేను
సలిపిన మేలైనఁ దలపవలదె?
తన యష్ట భార్యలందున మేటిపీవంచుఁ
బలికిన పలుకైనఁ దలపవలదె?
సత్యాప్రియుండగు శౌరియటంచాడు
పలుపురి మాటైనఁ దలపవలదె?
మచ్ఛమంతకమణి మహితమౌధనరాసు
లెలమి నిచ్చుటయైనఁ దలఁపవలదె?

గీ॥ తనకు నే మేలు సేయని దినమొకండు
లేదుగద! యిట్టి నన్ను నెల్లిదమొసర్చి
సాటి స్త్రీలకో నగుఁబాటు చేటుదెచ్చె
నౌర! శ్రీ కృష్ణుఁడిది యోర్వనగునె? తగునె?

నారదుఁడు:—

తల్లీ! కృష్ణునంతవానికే కృతజ్ఞత్వము లేదన్న మనమింక నేమి చేయఁగలము? కానిమ్ము వగవకుము. కాలమొకేతీరుగా నెవరికి నుండదుకదా! చంద్రునంతవానికి మబ్బులావరించి మఱల విచ్చిపోవుటలేదా? నీకుమాత్రము చెడ్డరోజులు పోయి మంచి రోజులు రాఁగూడదా?

# మే ఘ నా ద వ ధ.

(కవిగారి అముద్రిత రచనయగు శ్రీ మాన్ నిర్వచన వెంకట రామాయణము నుండి కొన్ని పద్యములు)

ఉ॥ ఓరి! విభీషణా! తగునె? యుక్త మయుక్తమటంచు నెంచకీ
దారుణ కృత్యమౌ కుల విదారణముఁ బొసరింపఁబూనితౌ
రౌర! దురాత్మ! యేమనఁగనౌనిను దానవవంశముఁ జెడఁ
గ్రూరుఁడ! నీవుపుట్టితివి; కూల్పఁగ నర్హుఁడవెల్ల భంగులఁ

ఉ॥ గౌరవహైన్యమంచనక, గ్రక్కునఁబోయి విరోధిపక్షముం
జేరి సమస్త భూప్రజలు ఛీ! యన మాదగు గుట్టు దంతయున్
వారికిఁ దెల్పుచుం గులము పాడొనరింపఁగ సిద్ధమైతివా?
యోరి! యధర్మచిత్త! తగవౌల్లక నీవిటు సేయఁ బాడియే?

సీ॥ ప్రవిమల క్షీరవారాశి లోపల మహా
భీకర విషముద్భవించినట్లు,
లలిత చందన వృక్ష విలసిత వనములో
భూరి కంటక శాఖి పుట్టినట్లు,
అభినవోజ్జ్వల మనోహర సస్యరాజికిఁ
జీడపురుగు మఱి చేరినట్లు,
కమనీయ పృష్ఠ భాగంబునఁ బెనురాచ
పుండకక్కజంబుగఁ బొడమినట్లు,

గీ॥ పావనంబగు దానవ వంశమందు
నీవు చెడఁ బుట్టితివి. పాపి! నీచహృదయ!
నిన్నిదే నిమిషంబులో నిహతుఁజేసి
కులము నిష్కలుషంబుగ సలుపువాఁడ.





ఆంధ్రవాల్మీకి—కవిసార్వభౌమ

## వావిలికొలను సుబ్బరావు
## (వాసుదాసు)

జననము:- 23—1—1863

నిర్యాణము:- 1-8—1936

తల్లి: శ్రీమతి కనకాంబ

తండ్రి. శ్రీ రామచంద్రరావు

భార్య:-శ్రీమతి రంగనాయకమ్మ

జన్మస్థలము: కడప జిల్లా—జమ్మలమడుగు

మతము—కులము:— హిందూ-బ్రాహ్మణ-స్మార్తులు

భారధ్వాజస గోత్రము.

వంశ చరిత్ర:—

కనకాంబా శ్రీరామచంద్రుల సంతానమునందు ప్రథములు శేషగిరిరావు గారు. ద్వితీయులు సుబ్బారావు- (మ న క వి గా రు) తృతీయులు రంగారావుగారు.

వావిలి కొలను సుబ్బారావుగారి వంశము పండిత వంశము. వారి ప్రపితామహులు రత్నాజీరావు పంతులు గారు బహుళ గ్రంథ కర్తలు, మహాకవులు, గొప్ప వ్యాఖ్యాతలు. వాల్మీకి రామాయణ మునకు వారు వ్యాఖ్యానమును వ్రాసియుండిరి. సుబ్బారావు గారి పూర్వులు ప్రప్రథమమున,నైజాము రాజ్యమునందలి వావిలికొలను అను గ్రామమున, నున్నకారణముచే వారిగృహనామము వావిలి కొలనైనది.

బాల్యము,విద్యాభ్యాసము:—

చిన్ననాటినుండియు వాసుదాసులవారికి శ్రీరామచంద్రుని యెడ, నపారమైన భక్తి కలదు. సుబ్బారావుగారి పండ్రెండవ యేటనే పితృవియోగము సంభవించెను. అప్పటినుండి వారి పితృ వ్యులగు, లక్ష్మజీరావు గారు పిన్నవయస్సులోనున్న వారిని దరిజేర్చి, విద్యాబుద్ధులుగఱపి, పెద్దవారి నొనర్చెను.

13వ యేటనే వాసుదాసుల వారికి 'క్షయవ్యాధి' సంభవించెను. ఈ క్షయవ్యాధిని లెక్కపెట్టక శ్రీవారు పాఠశాలలో జదువు సాగించుచు మఱియొక ప్రక్క సంస్కృతాంధ్ర గ్రంథములను దీక్షతో విమర్శనా పూర్వకముగా పఠింపసాగిరి. అనతి కాలములో, ఉభయ భాషలయందును మంచి పాండిత్యము సంపాదించిరి. అంతయు స్వయంకృషిలబ్ధము. పోతనవలెవారు సహజ పండితులు. శ్రీవారు ప్రవేశ పరీక్ష యందుత్తీర్ణులై 1882-83లో F.A పరీక్షకుఁజదువు చుండగా క్షయవ్యాధి ప్రబలి, తీవ్రరూపమును ధరించగా, వారి పిన తండ్రిగారు వారినిఁజదువు మానిపించిరి.

ఈ కాలములో శ్రీవారు, సంస్కృతాంధ్ర గ్రంథపఠనము సాగించుచు, నద్వితీయ పాండిత్యమును సంపాదించిరి. సారస్వత జలధి మథించి, రసామృతసిద్ధిఁ బొందుటచేఁ గావలయుఁ దీవ్రతరమైన వారిక్షయ వ్యాధి కొంత యుపశమించెను.

ఉద్యోగ వివరములు:—

1883వ సంవత్సరము ఆగస్టు 10వ తేది అనగా తమ ఇరువదవ యేట ప్రొద్దుటూరు తాలూకా కచేరీలో నుదరపోషణార్థమై, ఏడు రూపాయల జీతముపై, గుమాస్తా యుద్యోగములో చేరిరి. క్రమ క్రమముగా రివిన్యూ ఇన్స్పెక్టరై పదుకొండు సంవత్సరములు (1896 సం॥ వరకు) పనిచేసిరి.

వివాహము :—

నెల్లూరు పురవాస్తవ్యులైన కంచనపల్లి వేంకట సుబ్బారావు గారి కుమార్తెయైన చి॥సౌ॥ రంగనాయకమ్మను పెండ్లాడిరి. ఈమె.

కొంకకాలు, కుంటియైనను, పినతండ్రిగారి మాటయందు గౌరవభావము కలవారు గాన వారి ఇష్టమే తనఇష్టమని జెప్పుచు నామెను చేబట్టిన పితృవాక్య పరిపాలకులు, 1910లో భార్యను కోలుపోయిరి. వీరికి సంతతిలేదు. కావ్యకన్యలే సంతానము.

## శ్రీవారి భక్తి ప్రపత్తులు.

శ్రీవారు సంసారములో మునిగియున్నను. జలనిమగ్నమైన తామరాకు చందంబున వారి దివ్య చిత్తము సాంసారిక సుఖదుఃఖములనంటలేదు. నిరంతరము శ్రీరామచంద్ర పాదారవింద సంసేవాసక్తులైయుండిరి. వారే యుద్యోగములోనున్నను, రామతారక మంత్రజపము, రామకోటి వ్రాయుట, ధర్మమత నీతి బోధకములగు కృతులు రచించుట, రాముని కంకితమొసంగుట, రామసేవజేయుట వారి నిత్యకృత్యములు. మహాకవియగు పోతన తాను రచించిన శ్రీమదాంధ్రభాగవతమును, కడప మండలము నందలి, 'ఒంటిమెట్ట' యను గ్రామమున వేంచేసియున్న, యే కోదండ రాముల కంకితమొసర్చెనో, యా కోదండ రాములే, సుబ్బారావు గారికి స్వప్నమునందు గనంబడి, "యొకకేలనాంధ్ర భాగవతము నందు కొంటిని, వేఱొకకేల నాంధ్రరామాయణముకూడ నందు కొందును. నీవదాని రచింపు" మని యాదేశించెను. ఆ దైవప్రేరణ వలన ఆది కావ్యమైన వాల్మీకి రామాయణమును, యథామూలముగా నాంధ్రీకరించిరి. ఒంటిమెట్ట యందలి 'రామతీర్థ'మను నొక కొలంకును బాగుచేయించిరి. కోదండరాములదేవాలయమును, జీర్ణోద్ధారమొనరించిరి.

1907వ సంవత్సరములో, ఒంటిమెట్టలో, పెద్దయుత్సవము సల్పి, తమ రామాయణ గ్రంథమును, పెక్కుమంది విద్వత్కవుల సమక్షమున, కోదండరాముల కంకితమొసంగిరి. ఆ సభలో వారికి 'ఆంధ్ర వాల్మీకి' యనుబిరుదు నొసంగి, గౌరవించిరి.

కవిగారి గుణగణములు:—

వావిలికొలను సుబ్బారావుగారు నిరాడంబరులు. త్యాగశీలత దైవమానవ సేవాపరత్వము, శిష్యజనవత్సలత, యౌదార్యము, కార్యదీక్ష కలవారు. యువరాజుగారు, మన భారతదేశమునకు వచ్చినప్పుడు వివిధ భాషలలో ప్రఖ్యాత కవి పండితులకు బిరుదము లిచ్చు సందర్భమునఁ బ్రభుత్వము వారు, సుబ్బారావుగారికి కూడనొక బిరుదము నిప్పించి, గౌరవించుటకు సంకల్పించిరి. తమకు బిరుద వ్యామోహము లేదనియు, తమ కెట్టిబిరుదమును వలదనియు వారు ప్రభుత్వమునకు వ్రాసిరట.

కవిగారి లక్ష్యము:—

తమ సర్వస్వమును, శ్రీరామ కైంకర్యమునకు వెచ్చించి, చక్కఁగా సద్వినియోగము చేయుటకే, ధర్మార్జనమును జేయవలె నన్నసూక్తి ననుసరించి విశేషధన మార్జించి, రామసేవకు వినియోగించి, నిరతాన్నదాతలై, మహాత్యాగులై, నిరాడంబరులై, యపార దైవమానవ సేవల నొనరించి,చరితార్థులైన సుబ్బారావుగా రాంధ్ర లోకమునకు చిరస్మరణీయులు. వీరు శ్రీరామనామ ప్రభావమును గూర్చి ప్రజలకు తమ శ్రీకృష్ణలీలామృతమునందిట్లు ప్రబోధించిరి.

సీ. పుచ్చిన పోఁకైన వెచ్చింపఁబనిలేదు
వాకిలిదాఁటెడి పనియులేదు
కదలక కూర్చుండు కష్టంబునులేదు
శ్వాసంబుబిగఁబట్టు చావులేదు
బుడికోళ్లవలెనీట మునుఁగు కార్యములేదు
నోరెండవల్లించు తీరులేదు
పొగదాఁకి కన్నులు పోయెడి పనిలేదు
కడుపుగాల్చు శ్రమంబు పడగలేదు

గీ. పరుల సాహ్యంబుఁ గోరుచు వారివెన్కఁ
బరువు పాఱఁగఁ బనిలేదు భ్రాతలార!
నాల్క మీనొత్తు రెండువక్షములుపల్క
ముక్తికన్యక మీనొత్తు పుణ్యులార!

## వీరు రచించిన గ్రంథములు

1) శ్రీకృష్ణలీలామృతము 2) ద్విపద భగవద్గీత 3) ఆర్యకథానిధులు 4) ఆర్యచరిత్రరత్నావళి 5) హితచర్యామాలిక 6) సులభ వ్యాకరణములు 7) శ్రీరామావతారతత్త్వములు 8) శ్రీకృష్ణావతారతత్త్వములు 9) సుభద్రా విజయనాటకము 10) తెంగరాయచిప్ప శతకము 11) ఆంధ్రవాల్మీకి రామాయణము 12) 'రమాకుమార' చరితము:— ఈ చరితమునే 'శ్రీకుమారాభ్యుదయ కావ్యముగా సంతరించి 'శ్రీ' మొదలు 'రా' వఱకు దేనితో మొదలిడినను కథావస్తువు గోచరించునని చెప్పిరి. 13) కౌసల్యా పరిణయము 14) 'భక్తసంజీవని' మాస పత్రిక. 15) మంథరము (రామాయణ పరిశోధన) 16) ఉపదేశ త్రియము

## శ్రీ కౌసల్యా పరిణయము:

పై కావ్యమును వావిలికొలనుసుబ్బరావుగారు 1894 వ సంవత్సరము, మార్చి నెల 16వ తేది ప్రారంభించి, 1894 వ సంవత్సరము, నవంబరు నెలకు సాంతము గావించిరి. అప్పుడు వారు, కడప జిల్లా—రాజంపేట తాలూకా, టంగుటూరు గ్రామము నందు, రివిన్యూ ఇన్‌స్పెక్టరుగా నుండిరి. కృష్ణామండలస్థులు, ఉంగ్రాజవరములోనగు తాలూకాల జమీందారులైన శ్రీ రాజా వెల్లంకి వేంకటరామారావు బహద్దురు వారు 1902వ సంవత్సరము లో ఈ కావ్యమును, ముద్రించిరి.

## కౌసల్యా పరిణయములోని కౌసల్యా, దశరథుల వివాహవేడుక

చం. తమకము మీఱ, వారలకుఁ దైధిమి, తోంధిమి, తోంధితోం
ధితోం
ధిమికిటధిమ్మి, తక్కతయి ధిం, తయిధిం, తయిధిమ్మటంచు, సం
భ్రమమునఁ దాలమానముల-మానితచంపక తైలమంటిరా
కమలవిలోచనామణులు—క్రమపుఁగంకణరావమొప్పఁగన్.

చం. పసిమి, పసిండిదువ్వలువ, భారతిగట్టునెడన్ బులోమజా
కిసలయపాణి, దివ్యమణికీర్తిత భూషలలంకరింపగా
నసమున, మేనకాదులు తదంఘ్రిల సొమ్ములుగూర్ప, భాసిలెన్
ససిని, గడాని మేనిదొరసానికి, సాటియనంగఁగాంతయున్.

చం. కడప, పిషాణబియ్యమునఁ గమ్మని యన్నము, పప్పు, దప్పళా
ల్వడియములప్పణంబులును, బజ్జులు, లడ్డు. జిలేబియాజ్యమున్
వశలును, నావపచ్చళులు, స్వాదుఫలంబులు లోసుగాఁగ మిన్
దొడుకు ఘటింప, నొక్క త్రుటిఁ దోఁచముగా, భుజియించి
రయ్యెడన్.

## శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణము (సుందరకాండ)

### హనుమంతుఁడు సీతాదేవికిఁ దన దేహము పెంచిచూపుట.

చం. ఎఱుఁగదుగాక యించుకయు నెంతటివాఁడనొ కానఁబల్కెన
న్నుఱక, మదీయరూపమిపు, డొప్పుగఁ జూపిన, నమ్మఁగాక, ఈ
తెఱవ, యటంచునెంచి, తనదివ్యమహాకృతిఁ జూప. నేలపై
కుఱికి, దుమ్మంబునుండి, రభసోద్ధతిఁ బెంపదొడంగెఁ
గాయమున్.

సీ. దీప్తానల ప్రభఁ దేజరిల్లుచు మేరు
మందర సంకాశ—మహిత రూప
మునఁ బాద్రమవక్త్రిఁ డై-ఘనవజ్రి సన్నిభ
దంష్ట్రా నఖంబులు—దద్దవెలుగ
జానకి ముంగలగా—నిలుచుండి, యి
ట్లనియె, నాసతితోడ—నాంజనేయుఁ
డోదేవి! సగిరివనోద్దేశముగ సాట్ట
వప్రతోరణముగ—వైరినాథు

ఆ. వె. తోడ లంకఁగొనుచుఁ దోరంపు జవమునఁ
బోవు శక్తి గలదు—భూమితనయ
పిన్నవాఁడనను, నభిప్రాయమును బాసి
రమ్ము జాలమేల? రాముకడకు.

## శ్రీ కుమారాభ్యుదయము

ఈ గ్రంథమందలి శబ్దార్థాలంకారంబులును, తత్తత్కాలోచిత శైలియు, భావిసూచకంబులగు పలుకులును, హృద్యంబులై, యనన్యసాధారణంబులయి, నెగడుచున్నవి. వేయేల? గ్రంథముచూడఁ జూడం రుచ్యమయి యెన్నిమాఱులు చదివినంగానివిసుగుఁ బుట్టింపనిదియయి యున్నది.

దీనికి సాటియగు గ్రంథము చిక్కుటయరుదు నిఘంటువు లెన్నే నీకవిగారికి ముఖస్థములగునని యీ గ్రంథము తెలుపుచున్నది చతుర్విధకవితల కిరవయి వివిధాలంకారంబులం బొదలుచు నింపు నింపుశైలివ్రాయబడియుండు నీగ్రంథము సుజన సమాదరణీయం బగుననుటకు సందియమున్నే? దీనిందుదముట్టఁజదివియర్థము

గ్రహించినవారికి యాంధ్రంబున నూతనశబ్దము గఱ్పట్టినని నొక్కి-వక్కాణింపఁదగును. కావుననీకవి 'నాంధ్రభమాషుఁడని' సంభావింపఁదగును. గ్రంథగౌరవముంబట్టి యెంతవ్రాసినను దనివివాలదు.

ఇట్లు,

26—3—1917. ఆంధ్రపత్రికాశిక, పత్రికాధిపతి.

## రంభవర్ణనము:—

సీ. కుంభికుంభ స్మయాలంభ, సత్కుచకుంభ
పీత తనూజిత శాతకుంభ
సారంగ కరరుచిరోరు రంభాస్తంభ
నిశ్చలయౌవనాన్వితవిజృంభ
కుంభినీ ధరవరోజ్జృంభకటీబింబ
శుంభద్విలాస సంస్తంభకుంభ
యాయజూకముదావహాగళితారంభ
మల్లికా కోరక—మంజు జంభ

గీ. బంభర విసిలకేశ కుసుంభవర్ణ
శుంభ దంశుక కసవక్షంభమునను
జంభ దనుజారిఁగొల్వ నవంభరక్తి
రంభ చనుదెంచె నధిక సంరంభమునను.





# నాటకకర్త-సాహితీశిల్పి శ్రీ రూపనగుడి నారాయణరావు

జననము:- 1—7—1885
నిర్యాణము:- 30—8—1963
స్వస్థలము:-బళ్ళారి పట్టణము.

తండ్రి:—శ్రీ నరసింగరావుగారు. వీరు కడపజిల్లా, ప్రొద్దుటూరులో శిరస్తాదారు, మేజిస్ట్రేటుగా పనిచేసిరి.

తల్లి:— సీతమ్మ.

మతము,కులము:— హిందూ-బ్రాహ్మణ

గోత్రము,నాడు:— హరితసగోత్రము—ములికినాడు.

విద్యాభ్యాసము:

వీరు తండ్రిగారు రిటైరైన తర్వాత, బళ్లారిలో నివాస మేర్పఱచుకొని కాపురమున్నందున కవిగారి విద్యార్థి దశయంతయు బళ్లారివార్డ్లా హైస్కూలులో జరిగినది.వీరు ఉత్తమశిక్షా క్రమమును బడసిరి. క్రికెటు, చదరంగములలో వీరికభిలాషమెంతు. శ్రీరావుగారు F. A.చదువునప్పుడు వీరి తండ్రి మరణించిరి. కాలేజివిడిచి, ఇంటిలోనే చదివి 1928లో F.A.పరీక్ష ప్యాసైరి. ఆంధ్ర, ఆంగ్లేయాది గ్రంథముల నత్యధిక శ్రద్ధతో జదువుచు, నాయావాఙ్మయము లందలి విషయ విశేషముల నార్జించిరి.

కుటుంబ విశేషములు—ఉద్యోగము.

శ్రీ నారాయణరావుగారి కిరువురు సోదరులు, నొక సోదరియు

నుండిరి. వీరికుటుంబమున పంన్రెండు మంది యుండిరి. కొద్ది కాలము తాలూకాఫీసులో, గుమాస్తాగా పనిచేసిరి. త్వరలో దానిని వదలి, రాజమహేంద్రివరము ట్రయినింగు కళాశాలలో, సుశిక్షితులై, మరుసటి సంవత్సరమే, అనంతపురము గవర్నమెంటు ట్రయినింగు స్కూలులో, యుపాధ్యాయులైరి. తరువాత బళ్లారి, కర్నూలు, రాయచోటి (కడప జిల్లా) చిత్తూరు మున్నగు పట్టణములందు, ట్రయినింగు పాఠశాలలయందు తెలుగు పండితులుగా పనిచేసిరి. మద్రాసు సైదాపేట టీచర్సు కాలేజీలోకూడా పనిచేసిరి. మొత్తము 40 సంవత్సరములు పాధ్యాయ వృత్తి నొనరించి 1940వ సంవత్సరములో బళ్లారిలో రిటైరయిరి.

## గుణగణములు—చేసినయాత్రలు

శమదమాదిగుణసంపన్నులు. సాహిత్యాభిమానులు. ఆధ్యాత్మిక ప్రియులు. శాంతి సౌమనస్యములు గలవారు. మంచి అరోగ్య విధులు పాటించువారు. పరోపకార పరాయణులు,

హరిద్వారము. ఋషీకేశము, కురుక్షేత్రము, మధుర-గోకుల బృందావనము మున్నగు పుణ్య స్థలముల దర్శించిరి. ఢిల్లీ, కాశీ, ప్రయాగ, బుద్ధగయమున్నగు క్షేత్రములను సేవించిరి. 1947లో పుదుచ్చేరికివెళ్లి, శ్రీ అరవిందుల దర్శనము చేసికొని, శ్రీ మాత గారి యాశీస్సుల బడసిరి. 1948 మార్చి నెలలో రామేశ్వరాది దక్షిణ దేశయాత్రలుగూడా గావించిరి.

## రచనలు—అందలి తీరుతెన్నులు:—

శ్రీ నారాయణరావుగారు పెక్కుగ్రంథాలు రచించినారు. కొన్ని ముద్రితములు. ఎక్కువభాగము అముద్రితములు. విన్య

త్కవి వరేణ్యులు శ్రీ నారాయణరావుగారు పెక్కురచనలు రచించియు వానిలో కొన్నింటినైన ప్రకాశపఱచుకొన జాలినవారుకారు.

శ్రీ నారాయణరావుగారు రాయలసీమయందు వన్నెగన్న విద్వన్మణులలో నొక్కరు. ఆ బాలవృద్ధులకుఁ బ్రయోజనకరము లగు కావ్య, నాటక, విమర్శనాదులు వీరు రచించినవి పెక్కులు. వానిలో బాలావబోధకములైన గ్రంథములు రమారమి పది. అనువాద సాహిత్యమున ఈ పండితవర్యుని చేయియందె వేసినది. నారాయణరావుగారి వచన కృతులలోఁ బెక్కులనువాదములు, శ్రీ వారాంగ్ల భాషనుండి యథామాతృకగ విషయము నాంధ్రీకరించుట యందు సిద్ధహస్తులు. వీరు పాండుచ్చేరి అరవిందాశ్రమమునఁ బ్రచురింపబడినఁ కాళిదాసు, భారతీయమేధ, 'యోగభూమికలు' 'జాతీయ విద్యా విధానము' 'జీవిత సమస్యలు' మొదలగుచిన్న యాంగ్ల గ్రంథములను పండ్రెండింటిని దెనిగించినారు భాషాంతర రచనలవలన నారాయణరావుగారి యంచంతర్నిహితమై యున్న కళోపాసనాశీలము, కావ్యపరనాసక్తి, పారమార్థికబుద్ధి, లోక సేవాపరత యతిశయించినవి తత్ఫలితముగాఁ దదుపరి భగవద్గీత 'Life Divine' మున్నగువాని సధ్యయనముచేసి 'ఆధ్యాత్మికోపాసన'లను గ్రంథములను వచనరూపమున రచింపఁగల్గిరి. వివిధ కవులకావ్యములఁగూర్చి కడుఁజక్కఁగ బరామర్శించు ఉద్గ్రంథము 'కావ్యనిదానము' విద్యార్థులకేకాక, యుపాధ్యాయులకును, పండితులకును గూడ, మిక్కిలి యుపకరించు గ్రంథరాజమిది.

శ్రీ నారాయణరావుగారి కబ్బములు దృశ్య—శ్రవ్య-రచన కృతులని మొత్తెరుగులు. అందు వీరు రచించిన దృశ్యకావ్యములు పదునుకొండు· వీనిలో స్వకల్పితములు ఆరు. ఆంగ్ల, గీర్వాణ భాషలనుండి యాంధ్రీకరింపబడినవి తక్కినవి. ఇందు మొదటి

ఆరింటిలో విప్రనారాయణనాటకము 1919—20లో రచింపబడి శృంగార, శాంత, కరుణ, హాస్యాదిరసములెల్ల విరియించు చున్నది. ఇయ్యది హిందూపురం శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల వారిచే 1932 నందు ప్రకటింపబడినది. అందలి ప్రకృతి వర్ణనలు మనోహరములును. గంభీరములును. సందర్భోచితములును. 'కవితా నీరాజన' మను ఖండకావ్యసంపుటి ముప్పదియారు శీర్షికలు గలవి. భర్తృహరి సుభాషిత రత్నావళి బోలిన నీతి ప్రదమగు 'ఆర్యసుభా షితము' ఒక పద్యకృతి, మహాకావ్యసారములనదగిన 4611 పద్య ములందు ప్రకాశితములు. వీరి కృతులలో వేలకొలదిచరణముల (22739) నొప్పిన యనువాద గ్రంథము 'సమాజభారతము.' కవి గారు దీనిని వార్ధక్యమున వ్రాసిరి. కేవలము సులభచ్ఛందములగు సీసము, కందము, తేటగీతి, ఆటవెలది, ద్విపద, రగడ లను జాతీయ పద్యములతోడనే ఇది రచియింపబడినది. సుప్రసిద్ధులగు శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యుల వారాంగ్లమున రచించినవచన భారతము దీనికిమూలము. ఈయది అనువాదమైనను స్వకల్పిత విషయ విశేషములు పెక్కులుండి రసభావ బంధురముగ విరాజిల్లు చున్నది.

శ్రీ నారాయణరావుగారి సాహిత్య సేవను పురస్కరించుకొని వారికి 16—12—1956 న శ్రీ శా ర దా పీ ఠ ము—హిం దూ పు ర ం (అనంతపురం జిల్లా) వారు "సాహితీ శిల్పి" బిరుదు ప్రసాదించి గౌరవించిరి.

ముద్రితకృతులు:- నాటకములు.

1) విప్రనారాయణ నాటకము—ప్ర: 1932. 2) గౌతమ బుద్ధుడు—ప్ర: 1936. 3) సౌందర నందన నాటకము—ప:-1964 4) ఉన్మత్తరాఘవము—ప్ర:1964

అనువాదాలు:—

1) అరవిందుని జీవిత చరిత్ర. 2) ప్రార్థనలు—ధ్యానములు. 3) అరవిందులవారి 'కాళిదాసు' నకు తెనుగుయనువాదము.

పద్యకృతులు:—1) పంపాపురీ శతకము (ప్ర: 1964)

అముద్రితములు: నాటకములు:—

1) కాకతీయ రుద్రాంబ. 2) విషాదరామరాజీయము. 3) క్షమావతీ విజయము. 4) మానవ విజయము.

అనువాదాలు:—

1) రవీంద్రనాథ ఠాగూరు వారి-గీతాంజలి, యజ్ఞము, మాలిని; 2) టాల్‌స్టాయి రచనలకు కొన్నియనువాదాలు.

ఇతరకృతులు:—

1) కావ్యనిదానము 2) శిశుమానసిక శాస్త్రము 3) ఆధ్యాత్మికోపన్యాసములు 4) ఆర్యా సుభాషితములు 5) రూపన కుమార భారతము 6) ఒకపది అరవిందుని ఆధ్యాత్మిక పొత్తములు.

కావ్యపరిచయము: సంఘాత మరణ వర్ణన.

1936వ సంవత్సరమున, "క్వెట్టా" భూకంపముపుట్టి, దానిచే నుప్పతిల్లిన వినాశమునుగూర్చి, యాదరార్ద్ర హృదయుఁడైన శ్రీ రూపనగుడి నారాయణరావుగారు, గేయరూపమున యిట్లాలాపించి, అశ్రుతర్పణ మొనరించినారు.

" రెండునొకటవ జామునంగోళ్లు—నిలుచుండి
చట్టపలు పటపటఁ జాడించి—మెడసాచి
పయిఁజూచి 'కొక్కొ—కోకో' యంచుఁగూపెట్టి
తమతావు లందట్టె—ముడిగికొని కనుమూసి
యుండంగ జాయాపతుల్ పొదివియొండొరుల
కౌఁగిళ్ల నాచలిని నిద్రించు చుంశంగ
బిడ్డలును, తల్లులును, నొత్తిగిలి పన్నుండి
యుండంగ నాఁకటను బెల్లేడ్చు శిశువులకుఁ
దల్లులుగడుఁ వత్సలత మెయిం జనుగుడిపి
నిదుర కంటను, వారిజోకొట్టు చుండంగ...... .... ..... .....
పురమొక్క పెట్టునఁ మొదలంటఁగానూఁగె;
...... ...... ..... ..... ...... .....పృథ్వియుం దన కరాళాస్యముం
దెఱచి, యిసుమును గ్రక్కె; బలువెలుంగుల సుమినె

\+ + + +

తమయిండ్లె తమపై—సమాధులై యేర్పశఁగ
నోట నుడువఁగరాని బాధలంబొందుచును
సుఖశయ్యలందున్న వారున్నటులె, నిజ
ప్రాణముల్ గోల్పోయి నారేమని వచియింతు? .... ...... ...... ......

శ్రీ నారాయణరావుగారి కుమార భారతములో ఇంద్రప్రస్థ పురమునందు ధర్మజుని పట్టాభిషేకశుభసమయమున మన్మథ పూజనొనర్చు కన్య పడుచులలో విజయుని మనసు నాకర్షించిన సుభద్రనిట్లు కవిగారు వర్ణించిరి.

సీ. అప్పుడప్పుడె పుల్లమౌ, పుష్పమునుదాల్చు
లలిత, మంజుల, దేహ, లతికదాని;
కుఱుచ—మట్టముగాక—మఱిచాల పొడువునుం
గాక—సమమగు విగ్రహముదాని;
కుసుమ సాయకు కేల—నెసఁగు పుష్పేతరం
బగు—నా అవశరమై—యశరుదాని;
ఉదయ సంధ్యాసమయోజ్జ్వ తారుణ రుచి
రాభ్రిముంబలె—రమ్యమైసదాని;

గీ. చంపక సదృశ చారునాసఁగలదాని;
కపట భావశూన్యాభివీక్షణముదానిఁ
జెలుల, యన్యోన్య భాషణంబులను గృష్ణ
సోదరియగు, సుభద్రిగా—నూహజేసె.
(ఆదిపర్వము 87... 98చ—రూపన్నకుమార భారతము)

ఇమ్మహాకావ్యము కర్తకుఁబుట్టువు నొసంగిన రూపనగుడి గ్రామమునందలి 'రూపన్నదేవు'న కంకితమొసఁగబడినది.

శ్రీ సీరిపి ఆంజనేయులుగారు తమ విజ్ఞానవల్లీ గ్రంథ మండలి ద్వారా పంపాపురీ శతకమును ప్రచురించిరి. శ్రీ రూపనగుడి నారాయణరావుగారి పై వీరికిగల గురుప్రేమ కిదితార్కాణము. కవిశేఖరుల జీవితచరిత్రను వీరేవిపులముగా రచించియిందు పొందు పఱచిరి. కవిగారి మరణానంతరం దీనితోబాటు 'సౌందరనంద నాటకము', 'ఉన్మత్తరాఘవ నాటకములు' గూడా ముద్రింపబడినవి.

సౌందరనంద నాటకమును శ్రీ రావుగారు. అగ్నిప్రమాదమునకు జిక్కి తన ప్రియభర్తను, వృద్ధ జననీ జనకులను శోకార్ణవమున ముంచిపరలోకమునకు జనిన తమ కడగొట్టు పుత్రిక శ్రీమతి సీతాలక్ష్మమ్మకంకితమొసగిరి. ఈమె శ్రీ A.S. రామన్ (Editor of "The Illustrated Weekly of India" గారి భార్య. ఈ మహనీయుని మరణవార్త విన్న శ్రీ కవిరాజ కలుగోడు అశ్వత్థ రావుగారు 'మిత్రస్మృతి' పేర,నిట్లంజలి ఘటించిరి.

ఉ. "మైసురుకట్టు "వెట్టిన, రుమాలును, కోటును, కంటిజోడు,చే
యూసరనున్న బెత్తమును, అద్దులముచ్చెలు, "పంచకచ్ఛ" చే
భాసిలు కట్టుపుట్టమును వాటిల, మద్భులవల్వనీటుగన్
వేసి భుజాన, అంజలిడు ప్రేమసఖుండిక మాకులేడుగా!

కం. సారంబైన కవిత్వ,మ
పారము పాండిత్యపున్ ప్రభాప్రతిభలు సౌ
మ్మెరంజిలె—రూపనగుడి
నారాయణరాయ! నీకు; నవ్యగుణాఢ్యా!

(పంపాపురీశతకమునుండి)





# ఆంధ్రనాటక పితామహ ధర్మవరం రామకృష్ణమాచార్యులు

జననము:— 1853

నిర్యాణము:— 30—11—1912

తండ్రి:— శ్రీమాన్ కొమాండూరు కృష్ణమాచార్యులు
తల్లి:— శ్రీమతి లక్ష్మీదేవమ్మ
జన్మస్థలము:—*అనంతపురం జిల్లా—ధర్మవరము.
మతము—కులము:—హిందూ—బ్రాహ్మణ—శ్రీ వైష్ణవులు.

## విద్యాభ్యాసము:

శ్రీమాన్ కొమాండూరు కృష్ణమాచార్యుల వారు ధర్మవరమున కుమారుల చదువునకు తగిన యనుకూలము లేనందున స్వకుటుంబముతో బళ్ళారి జేరిరి. వీరచ్చట "వార్డ్‌లా కాలేజి" లో ఆంధ్రోపన్యాసకులుగా పని చేయుచు, ప్రసిద్ధ వైద్యులుగను. పౌరాణికులుగను పేరుపొందిరి. తండ్రి వద్దనే ఆంధ్ర, సంస్కృత, కర్ణాటక భాషలను మనకవిగారభ్యసించిరి.1870లో మెట్రిక్యులేషన్ పరీక్షలో జయమొందిరి.

ఆచార్యుల*తాతగారు (తండ్రి—తండ్రి) కూడా తెనుగునను, సంస్కృతమునను చక్కని జ్ఞానముకలవారు, తాతగారివద్ద ఆచార్యుల వారు మూడునెలలలో రఘువంశము నేర్చుకొని,సంవత్సరము లోపలనే చంపూ రామాయణము, ప్రతాపరుద్రీయముకూడా చదివి ముగించిరి.

1874వ సంవత్సరములో యఫ్. ఏ. పరీక్షలోను, The Second grade Pleader-Ship Examination లోను ఉత్తీర్ణులైరి. అప్పటికి వారి వయస్సు 21వ సంవత్సరములు మాత్రమే. కొంతకాలము ఆదోని తాలూకా కచేరిలో గుమాస్తాగా పనిచేసి తరువాత బళ్లారి కంటోన్మెంట్ మేజిస్ట్రేటుకోర్టులో ప్రైవేటు వకీలుగా పని ప్రారంభించిరి.

అభిరుచులు:—

వీరు సంగీతములో, ఆయుర్వేదములో, నాడీపరీక్షలో, జ్యోతిశ్శాస్త్రములో, చదరంగములో ఆరితేరినవారు. కవితాశక్తిని అలవరచుకొని, అష్టావధానములు, శతావధానములు చేసిరి.

—వెనుక పేజిలోని * చుక్కల వివరము—

* డాక్టర్ పి. ఎస్ ఆర్. అప్పారావుగారి 'ధర్మవరం రామకృష్ణమాచార్యులు' ఆధారం. దీనిని ధర్మపురియని కూడా వ్యవహరించిరి.

* వైద్యము కృష్ణమాచార్యుల వారు మన కవిగారికి తాతగారు. వీరు సంస్కృత విద్వాంసులు. ఆయుర్వేద వైద్యమున నహితము వీరికెక్కువ యనుభవము గలదు. వీరి తమ్ములు దీక్షాచార్యులు. నాడీజ్ఞానమునందసమానులు. ఈ సోదరులకు సంతతిలేక పోవుటచేత పెద్ద సోదరుడు తాడిపర్తి తాలూకా జూటూరి యగ్రహారమున 'నుత్కలము' వారింటినుండి బాలకుని దత్తునకు దెచ్చుకొనిరి. ఆ దత్తపుత్రులే శ్రీమాన్ కొమాండూరు కృష్ణమాచార్యుల వారు. వీరికి చక్కని విద్యాబుద్ధులుగఱపి, యుక్తవయసున వివాహమొనరించిరి. వీరి ప్రథమ పుత్రుడే మన నాటక కర్త. (శ్రీ సిరిపి ఆంజనేయులవారి 'ధర్మవర చరిత్రము' ఆధారము)

కుటుంబచరిత్ర:

ఆచార్యులవారిది పేద బ్రాహ్మణ కుటుంబము. వీరు జ్యేష్ఠులు. వీరి 16వ యేటనే తండ్రి పరమపదించిరి. కుటుంబ భారము పెద్ద కుమారునిపై బడినది. వీరికి ముగ్గురు సోదరులు. ముగ్గురు సోదరీ మణులుకలరు. పెద్ద తమ్ముడు శ్రీ గోపాలాచార్యులు (సెకెండు గ్రేడు ప్లీడరు) రెండవ తమ్ముడు శ్రీ శేషాచార్యులు; మూడవ తమ్ముడు శ్రీ వేంకటకృష్ణమాచార్యులు (న్యాయవాదులు) పెద్ద చెల్లెలు శ్రీమతి శేషమ్మగారు. ఈమె కుమారుడు కళాప్రపూర్ణ బళ్లారి రాఘవాచార్యులుగారు. రెండవ చెల్లెలు శ్రీమతి చిన్న శేషమ్మ. మూడవ చెల్లెలు శ్రీమతి కృష్ణమ్మ.

వివాహము:

ఆచార్యులవారి తొలికళత్రము, వివాహమైన కొలది రోజులకే చనిపోయినది. రెండవ వివాహ ప్రయత్నములో ఆచార్యుల వారొక వధువు జాతకము చూచుట సంభవించినది. జ్యోతిషములో మంచి యనుభవము కలవారగుచే ఆచార్యుల వారా వధువును వివాహమాడిన, తానత్యున్నతస్థితికి రాగల యవకాశముగలదని, తమ బంధువుల కెవ్వరికినీ యిష్టములేకున్నను, నామెనే చేబట్టిరి. ఆమెకాపురమునకు వచ్చినతరువాతనే ఆచార్యులవారి దశమారినది. వీరు తమ పెద్ద కుమారునకు కృష్ణమాచార్యులని పేరిడిరి. పెద్ద కుమారులకు 'కృష్ణమాచార్యుల' ని పేరిడుట వీరి వంశాచారమైయున్నది. వీరి రెండవ కుమారుడు వేణుగోపాలాచార్యులు, మూడవ కుమారుడు రంగాచార్యులు.

సాహిత్యపరిచయము:

వీరికి చిన్ననాటి నుండియు తెనుగుభాషపై మక్కువ కలదు. తమ యిరువది యేడవ ప్రాయముననే అనగా 1874 నందే, నేదేని

కావ్యము రచించు కుతూహలముగలిగి, గోత్రి కర్తయగు 'గాధి నందను చరిత్రము' పద్యకావ్యముగా వ్రాసి, సగములోనే ఆపిరి. తరువాత నాటక రచనపై కుతూహలమేర్పడుటచే, సంస్కృత, ఆంగ్ల భాషలయందలి నాటకముల నాసక్తిగా జదివి 1879 లో 'ఉన్మాదరామ ప్రేక్షణికము'—'మదన విలాసము అను చిన్నినాటకములను. 'చిత్రనళీయనాటకము'ను రచించిరి. వీరిని బ్రహ్మ శ్రీ చిత్తవాడిగి హనుమంతగౌడు (కర్ణాటక నాటక రచయిత) గారు నాటక రచనకు ప్రోత్సహించిరి. దేశబాషలలో నాటకములకు దగిన భాష కన్నడమే యనియు, తెనుగందులకు దగదని యభిప్రాయపడిన బళ్లారిపురవాసుల కాచార్యులవారు తమ తెలుగు నాటకరచన, ప్రదర్శనములచే మెప్పునందిరి. 1886లో మిత్రుల సహాయముతో 'సరసవినోదిని' సభను నెలకొల్పి, తమ తొలి కన్నడ నాటకమగు 'స్వప్నానిరుద్ధ'ను ప్రదర్శించిరి. అందే 29—1—1887 లో చిత్ర నళీయమను తెలుగు నాటకమును ప్రదర్శించి బళ్లారి కన్నడ సీమ కాదను మాటస్థిరముగా నాటునట్లు చేసి కృతార్థులైరి.

నాటకకర్తలేకాదు సటులు. దర్శకులుకూడా:

ఆచార్యులవారు నాటకకర్తలేకాదు, గొప్పనటులుకూడ. వీరనేక పాత్రలుధరించిరి. నాటకిములను రక్తికట్టించిరి. చిత్ర నళీయ' నాటకమందు ఆచార్యులవారే ప్రధాన పాత్రలను పోషించుచూ దర్శకత్వమునుగూడ నిర్వహించెడివారు. వీరుసంగీతములో నిధులు. పాటకు, పద్యములకు రాగములు వారే నిర్ణయించెడివారు అర్థమును, అభినయమును జెడగొట్టని, శ్రావ్యమైన సంగీతమునే వారు పాడెడివారు, దానినే రంగస్థళముపై కూడ అమలులోనుంచెడివారు, మోహన, జంఝూటి, కేదారగౌళ ,కమాజు రాగములు వీరి కత్యంత ప్రీతి పాత్రములైనవి.

'సరస వినోదినీసభ' వారి ప్రదర్శనములన్నింటికీ వీరే 'రిహార్సల్సు' చేయించు భారము వహించెడివారు. ఏదైనా నాటకమును వ్రాయుముందు, ఆభూమికలకు దగిన నటులనే, యెన్నుకొని వారిని దృష్టియందుంచుకొని, తమ రచనను సాగించెడివారు. ఏ మాత్రమలసతనుగానీ, అజాగ్రత్తనుగానీ సహించు వారు కారు. నటులు తప్పు చేసినప్పుడు, వారిని తీవ్రముగా దండించెడివారు.

వీరు దశరథ, బాహుక, రాజరాజనరేంద్రుడు, చిరకారి, అజామిళ పాత్రలు అభినయించుటలో దిట్టలుగా పేరు పొందిరి. ఆచార్యుల వారు పాదుకాపట్టాభిషేకమునందు దశరథుల పాత్రను పోషించెడివారు. ఈ నాటకమునందు వీరి నటన జూచిన వారెవ్వరూ కంటతడిపెట్టనివారులేరు. ఒకసారి మద్రాసునందు కొందఱు పెద్దలాచార్యులవారి నటనపై సవాలుచేసి ప్రదర్శనకు హాజరైరి. సీతారామలక్ష్మణు లడవికేగు ఘట్టమందెంతగా శోకము బిగబట్టి కూర్చొన్నను, దశరథుని మరణ ఘట్టమునందు మాత్రమాచార్యుల వారి వాచక, ఆంగిక, సాత్త్వికాభినయము లనుభవములోనికి వచ్చినప్పుడు వారికి దుఃఖమాగకపోయినది. వారాచార్యుల వారి నటనా ప్రావీణ్యము నభినందించిరి.

సన్మానములు-బిరుదులు:—

---

1891 వ సంవత్సరమున ఆచార్యుల వారికి చెన్నపురి రాజధాని కళాశాల యందలి సంస్కృత పండితుడు కీ. శే. ఓపర్తు పండితుడు వీరి నాటకమునకు మెచ్చి రతనాల బంగారు పతకమును బహూకరించిరి. ఆ కాలములో దాని వెల రూ. 700—00 (ఏడువందల రూపాయలు). ఇట్లు వీరు పెక్కు పతకములను పొందిరి.

1910 వ సంవత్సరములో గద్వాల మహారాజు వీరిని 'ఆంధ్ర నాటక పితామహ' అను బిరుదుతో సత్కరించిరి. పుర ప్రముఖులు వీరికి రత్నఖచిత కిరీటమును బహూకరించిరి.

వీరు ఆంగ్ల, ఆంధ్ర, కన్నడ భాషలయందును నాటకములను రచించిరి. తెలుగు నాటకములు 28, కన్నడ నాటకములు 2, ఆంగ్ల నాటకము 1, మొత్తము 31 నాటకములు రచించిరి.

వీరినాటక రచనలు:

1) ఉపేంద్ర విజయము (వామనచరిత్ర) 2) స్వప్నానిరుద్ధ నాటకము (ఉషాపరిణయము) ఇవి కన్నడ నాటకములు.

తెలుగు నాటకములు—ముద్రితములు:

1) చిత్రనళీయము 2) పాదుకా పట్టాభిషేకము 3) ప్రహ్లాద 4) సావిత్రీ చిత్రాశ్వము 5) మోహినీ రుక్మాంగద 6) విషాద సారంగధర 7) బృహన్నల 8) ప్రమీళార్జునీయము 9) పాంచాలీ స్వయంవరము 10) చిరకారి 11) ముక్తావళి 12) రోషనారా శివాజీ 13) వరూధినీ నాటకము 14) అభిజ్ఞానమణిమంతము (చంద్రహాస)

అముద్రితములు

15) ఉషాపరిణయము 16) సుశీలాజయపాలీయము 17) అజామిళ 18) యుధిష్ఠర యౌవరాజ్యము 19) సీతా స్వయంవరము 20) ఘోషయాత్ర 21) ఉన్మదరాఘవ ప్రేక్షణికం 22) రాజ్యాభిషేకము 23) సుగ్రీవ పట్టాభిషేకము 24) విభీషణ పట్టాభిషేకము 25) హరిశ్చంద్ర 26) గిరిజాకల్యాణము 27) ఉదాస కల్యాణము 28) మదన విలాసము 29) ఆంగ్లమున హరిశ్చంద్ర.

నాటక రచనావిధానము:

శ్రీ ఆచార్యుల వారు సంస్కృతనాటక లక్షణాలను, ఆంగ్ల, పార్సీ నాటక లక్షణాలను మేళవింపజేసి నూతన పద్ధతిలో నాటకాలు రచించిరి. సంస్కృత నాటకములలోని పద్యములు, ఆంగ్ల నాటకములలోని 'అంకాలు–రంగాలు', పార్సీ నాటకములలోని పాటలు వీరు తమ నాటకములలో సమ్మేళించిరి. క్రొత్త పద్యములు, గేయాలు, రాగమాలికలు, సంవాదకీర్తనలు రచించిరి. విషాద సారంగధర నాటకమునకు దేశములో మంచి ఆదరణ లభించెను. ఆ కారణముననే ఆచార్యులవారు చంద్రహాస, ముక్తావళి, అజామిళ నాటకములను విషాదాంతములుగా రచించిరి.

గ్రంథముల పరిచయము:

వీరి నాటకములందు పాటలెక్కువ. చిత్రనళీయ నాటకమునందు 217 పద్యములు, 63 పాటలు, 15 సంవాదకీర్తనలు వ్రాసిరి. 'ప్రజాబలం' అజేయమని వీరు నాటకములద్వారా ప్రబోధించిరి. వీరు చిత్రనళీయం, పాదుకాపట్టాభిషేకములందు ప్రజలను పౌరులనే పేరుతో రంగస్థలముపై ప్రవేశ పెట్టిరి. భారతంలో నలుడు అరణ్యవాసానంతరం తిరిగి పుష్కరునితో జూదమాడి రాజ్యము గెలుచుకొన్నట్లు వ్రాయబడినది. ఆచార్యులవారు దానిని మార్చి పుష్కరుని మీద ప్రజలు తిరుగబడి బంధించి కారాగారములో పడవేసి రాజ్యము నలునికప్పగించినట్లు రచించిరి. తమ చిత్రనళీయ నాటకము చిరకాలము విలసిల్ల కవిగారిట్లు వ్రాసుకొనిరి.

ఉ॥ ప్రాకట సంస్కృతాంధ్రిక విదర్యుల కంజలిఁజేసి తత్కృపా
స్తోకత రామకృష్ణకవి సోముఁడుదంచితసార సంవిధా
నైకత సంపతిల్ల–రచియించిన, చిత్రనళీయనాటకం
బాకమలాప్తతారక, మృగాంకముగా, విలసిల్లుఁగావుత౯

కొందరు విమర్శకులు చిత్రనళీయ నాటకము 'అతుకుల బొంత' యని విమర్శించిరట! అందుకు సమాధానముగా,

ఉ. కొంచెపు పెంటలేరితిను, కుక్కుటముల్ నిను, కందిగింజగా
దంచు,త్యజించు నంతనెయహో! యపకీర్తియె? నీకురత్నమా!
కాంచనపీఠి నిన్నునిడి! కాంత కిరీటము లందునిల్పి, య
భ్యంచితరీతిమస్తకము లందు ధరింపరె? రాజశేఖరుల్

అనిసూటిగా జవాబిచ్చిరి

అభిజ్ఞానమణిమంత నాటకము (చంద్రహాస నాటకము.)

ఆచార్యులవారు తొలుదొల్తనీ చంద్రహాస నాటకము విషాదాంతముగా రచించిరి. కాని యట్టి నాటకముల నాదరింపబడనికాలమగుటచే గ్రంథకర్త దీనిని మనసొప్పకున్నను మోదాంతముగ మార్చి. ముద్రించిరి. దీనిపై 15—8—1916 నాటియాంధ్రపత్రిక ఈ దిగువ యభిప్రాయమును వెలిబుచ్చినది.

"— — — దీనిని దుఃఖాంతనాటకముగ రచించి మదన,కుంభీనసుల నిరువురనిగాని లేక కుంభీనసు నొక్కనినైనగాని గతప్రాణునిగా నొనరించిన దీని నీతిని ప్రేక్షకులు మఱింత స్ఫుటముగ గ్రహింప గలుగుదురని తోఁచుచున్నదిగాని, మనవారట్టి ప్రదర్శనములను చూచి సహింప జాలరని, గాబోలు ఆచార్యులవారు దీనిని కల్యాణాంతముగా నొనర్చియున్నారు. ఆంధ్రలోక విఖ్యాతులగు నాచార్యులవారి రచనాచమత్కృతిని వర్ణింపఁగడంగుట వెఱ్ఱితనము

ఇదివర కాంగ్లభాషలో నొకరీనాటకమును వ్రాసియున్నను ఆచార్యులవారు దాని నాధారముగ గొనక స్వకపోలకల్పనలనే యొనరించుట కడుంగడు ప్రశంసనీయము."

ఇట్లే, ముక్తావళీ నాటకమును సహితము బలవంతముగ మోదాంత మొనర్పబడినందుకు కవిగారు మనసునొచ్చుకొని, ఇంకొకపరి ముద్రింపబడు భాగ్యముగలిగిన వాటిని ఖేదాంతముగానె ముద్రింప నిశ్చయించుకొన్నట్లు 'చంద్రహాస' యందు వ్రాసుకొన్నారు,

నాటక ప్రయోగములో, నటనలో ఆచార్యులవారు వేసిన బాటలే నేటికి, జీవికనటులకు శరణ్యము. రంగస్థలము మీద రాగయుక్తంగా పద్యంపాడు ఆచారం ఆచార్యులవారు తెచ్చిపెట్టినదని ప్రతీతి. ఇటి మహనీయులొకసారి ఆలూరునకు(కర్నూలుజిల్లాలో) కేసుకై వెళ్లి, వాదించి వెనుకకు తిరిగి వచ్చుచుండిరి. అక్కడి మేజిస్ట్రీటు పడసాల 'శ్రీరాము' లనువారిని చూచుచు, మెట్లు దిగుచుజారి 'హారామచంద్రా' అనుచు అసువులబాసిరి.

ఆది 30—11—1912 సాయంకాలము. రాత్రికి బళ్లారికి వీరిమృత దేహముతేబడి మరునాడు వేలకు పౌరులు వెంబడింప, అతని కళావంతమైన కాయము కూడ కనుమఱుగై పోయినది. అప్పటి కతని వయసు 60 ఏళ్లు పూర్తికాలేదు. మన సీమయందేకాక, దేశమంతట అచార్యుల వారికీర్తి ఆచంద్ర తారార్కము విలసిల్లుచున్నది.



# ఆంధ్రచరిత్ర నాటక పితామహ కోలాచలం శ్రీనివాసరావు

జననము:— 13-3-1854
నిర్యాణము:— 23-6-1919
తండ్రి:— శ్రీ సేతుపతి శాస్త్రిగారు
తల్లి:— అచ్చమాంబ
జన్మస్థలము:—బళ్ళారి జిల్లా హంపిక్షేత్రమునకు సమీపమునగల కామలాపురము.

## వంశచరిత్ర:—

కాళిదాస, మాఘ. భవభూతి, భట్టనారాయణాద్యనేక గీర్వాణకవిశేఖరుల కృతిరత్నములకు వ్యాఖ్యానము వ్రాసి పండితావతంసులని, ప్రసిద్ధిగాంచిన కోలాచలం మల్లినాథసూరి వంశమున, కోలాచలం శ్రీనివాసరావుగారు జన్మించిరి. శ్రీనివాస రావుగారి పితామహులైన గంగాధరశాస్త్రి పరిసరాలలోని భూసంప దపై అధికారంకలిగి, 'హంపీ' సమీపములోని 'కామలాపురం'లో స్థిరపడిరి. వీరిభార్య శ్రీమతి సుబ్బమ్మగారు. ఈ దంపతులకు సేతు యాత్రా (రామేశ్వరము) నంతరము పుత్ర సంతానముగలుగగా సేతుపతిశాస్త్రి యనినామకరణ మిడిరి. సేతుపతిశాస్త్రి పెరిగి పెద్ద వారైన తరువాత ఆనాడానెగొంది రాజైన శ్రీమత్తిరుమల దేవ రాయలవద్ద మంత్రి (దివాన్) పదవిని స్వీకరించి ప్రసిద్ధికెక్కిరి. వీరికారుగురు సంతానము. వారిలో కనిష్ఠ పుత్రుడే మన శ్రీనివాస రావుగారు. సేతుపతి శాస్త్రిగారుత్తమ గుణగరిష్ఠులు, దయాధర్మాలు వారిసొత్తు. వీరు 1836లో. మరణించిరి,అప్పటికి శ్రీనివాసరావునకు 9 వత్సరములు.

విద్యాభ్యాసము:

తండ్రి మరణానంతరము శ్రీనివాసరావుగారిని వారి బావ తిన్నవేలి కుప్పుస్వామయ్యగారు చేరదీసిరి. బళ్ళారికిగొనిపోయి, విద్యాబుద్ధులుగఱపిరి. వీరాంధ్రభాషతో పాటు సంస్కృతము, కాలోచితంగా ఆంగ్లభాషనచిరకాలములోనే అభ్యసించిరి. వీటికి తోడు కర్ణాటభాష యలవడినది. 19వయేట 1873 సం॥లో 'మెట్రిక్యులేషన్' పరీక్షలోనూ, 1876లో అనగా 22వ సం॥లో,ఎఫ్.ఏ.లో నుత్తీర్ణులైరి.

ఉద్యోగము:

'ఉద్యోగం పురుష లక్షణము' అన్నట్లు శ్రీనివాసరావుగారు స్వతంత్ర జీవితము గడుపదలచి, యుద్యోగ ప్రయత్నము కొనసాగించి, అనంతపురం జిల్లా గుత్తిలో 12 సం॥ లు (1877–89) 'రివిన్యూడిపార్టుమెంటు' లో ఉద్యోగము నిర్వర్తించిరి. స్వేచ్ఛాజీవులు, కళాపిపాసువులైన శ్రీనివాసరావుగారికి ఉద్యోగమొకపెద్ద బంధమైనది. 1889 లో తమ 35వ ఏట ఉద్యోగమునకు రాజీనామా నిచ్చి బళ్ళారిజేరిరి. అప్పుడు వీరి అన్న వేంకటరావుగారు సుప్రసిద్ధ న్యాయవాదులై కీర్తి ప్రతిష్ఠలతోపాటు ధనసంపాదన చేయుచుండిరి. వీరు తమ్ముని చేరదీసిరి. అప్పటనుండి శ్రీనివాసరావుగారికి న్యాయవాద వృత్తిపై అభిలాష కలిగినది అనుభవముతో 'సెకెండుగ్రేడు ప్లీడర్షిప్' పరీక్షలో కృతకృత్యులై 1892లో స్వచ్ఛందమైన న్యాయవాదవృత్తి నవలంబించిరి, బళ్లారిలోనే "ప్రాక్టీసు" ప్రారంభించిరి.

## కుటుంబచరిత్ర:

శ్రీరావుగారి భార్యలక్ష్మమ్మ. ఈ దంపతులకు నల్గురు కుమారులు, ఒకకూతురు జన్మించిరి. వీరి జ్యేష్ఠ కుమారుడు శత్రుఘ్నరావు. శ్రీరామరావు, జయరత్నం, ప్రతాపరావులు తదితరులు. సునందనమ్మ వీరి కుమార్తె.

## సాహిత్యపరిచయము:—

శ్రీనివాసరావు, తెలుగు 'ఇంగ్లీషు' కన్నడము. మరాటి, భాషలలోనేగాక, సంస్కృతభాషలోకూడ' నపారమైన పాండిత్యము కలవారు. ఆనాడు బళ్లారి మునిసిపలు హైస్కూలు హెడ్డుమాష్టరు, ఆర్కాటు భీమాచార్యులు, తెలుగు పండితులైన రావాడ వేంకట రామాశాస్త్రులు వీరికి స్నేహితులైరి, వారితోకలసి, సాహిత్యగోష్ఠిని జరుపుచుండిరి, అప్పుడు రావుగారికి గ్రంథ రచనా సక్తి కల్గి, (1892లో) వైజయంతీ విలాస నాటకమును వచన రూపముగా వ్రాయుటకు మొదలిడిరి.

ఒకప్పుడు పూనా నగరమునుండి, బళ్లారికి కేశవగంధర్వ కంపెనీవారు, బాలగంధర్వ కంపెనీవారు, వచ్చి, మహారాష్ట్రి భాషలో 'రాక్షసీ మహత్వా కాంక్ష' "మానావమానము" అను సాంఘిక నాటకములను ప్రదర్శింపగా, భాష తెలియకున్నను, సంగీతము, రంగ నిర్మాణ చాతుర్యము పలువుర నాకర్షించుటచే, రావుగారా నాటకద్వయమును—రెండు నెలల లోపుగా మహారాష్ట్రిభాష నభ్యసించి—తెలుగులో వ్రాసి, ప్రదర్శించి గౌరవ ధనలాభముల నశేషముగ బొందగలిగిరి.

శ్రీనివాసరావుగారు సాంఘిక నాటకములనే వ్రాసి ప్రదర్శించు చుండగా, 'సరసవినోదినిసభ' వారు పౌరాణిక నాటకములనే ఖేలనము గావించుచుండిరి. "సుమనోరమసభ" కూడ పౌరాణిక నాటకములను ప్రదర్శింప గోరిక కల్గి రావుగారిపై నొత్తిడి తెచ్చి, వారిచే పౌరాణిక నాటకమును వ్రాయించెను. అదియే మార్కండేయ పురాణమందలి 'మదాలస చరిత్ర' నాటకము. అదియే వారి మొదటి పౌరాణిక నాటకము.

సాంఘిక నాటకములను వ్రాయుట మాని, శ్రీనివాసరావు గారు చరిత్రలోగల సంఘటనల నితివృత్తముగా గైకొని నాటకములను వ్రాయ మొదలిడిరి. తమ జన్మస్థానము కౌమలాపురము, కీర్తి గడించిన బళ్లారి పురము, తత్పరిసర ప్రాంత మంతయు అలనాటి విజయనగర సామ్రాజ్యములోని భాగములే. తద్రాజ్య పతన మితివృత్తముగా గల చరిత్రాంశములతో గూడిన' రామరాజు చరిత్రము' అను నాటకమును వ్రాసిరి. రావుగారి కీర్తి దశదిశల నల్లుకొనజేసినదీ నాటకమే! అందలి "పఠాను" పాత్ర బహుప్రశంసలనొంది, కీ. శే. రాఘవగారభినయింపగా నా పాత్రకే గాక, నాటకమునకు లభించిన పేరు ఆ చంద్రార్కము. తన్నాటకకర్తకు 'ఆంధ్రచరిత్ర నాటక పితామహ' బిరుద మిప్పించిన దీ నాటకమే. చరిత్ర నాటకములలో దీనికే యగ్రస్థానము!

వీరురచించిన నాటకములు:—

సాంఘికములు: 1) సునందినీ పరిణయం, 2) సీమంతిని. 3) సుఖమంజరీ పరిణయం, 4) యువతీ వివాహం, 5) మానవ పిశాచం, 6) రాక్షసీ మహత్వాకాంక్షి. 7) మానావమాన.
ప్రహసనములు: 1) అన్యాయ ధర్మపురిమహిమ, 2) నాచిపార్టి,

3) ఆచారమ్మ కథ (కన్నడం) 4) సమయమునకు భార్య.
చారిత్రాత్మికములు:— 1) రామరాజు, 2) ప్రతాపాక్బరీయం, 3) సుల్తానా చాందుబీ, 4) శిలాదిత్య, 5) మైసూరు రాజ్యం, 6) చంద్రగిర్యభ్యుదయం, 7) కాళిదాసు (అనుసరణ).
పౌరాణికములు:— 1) శ్రీరామజననం, 2) సీతాకల్యాణం, 3) పాదుకా పట్టాభిషేకం, 4) లంకా దహనం, 5) కుశలవ, 6) ద్రౌపదీ ప్రస్తాపహరణం, 7) కీచకవధ, 8) భారత ధర్మయుద్ధం 9) శిరోమణి, 10) బభ్రువాహన, 11) మదాలస, 12) రుక్మాంగద 13) హరిశ్చంద్ర, 14) ప్రహ్లాద, 15) చంద్రహాస, 16) గిరికా కల్యాణం.

నాటకముల పరిచయము:—

<u>రామరాజు (The fall of Vijayanagar)</u>. పఠాన్ రుస్తుం విజయనగర ప్రభువు అళియ రామరాజునకు, నొక ముస్లిం యువతికిని బుట్టినవాడు. అతడు ఆషాబీయను ముస్లిం వనిత మోహంలోజిక్కి ఆమెనవమానించిన రామరాజును, తండ్రియని యెఱిగికూడా మోసముతో చంపివేయును. చంపినతరువాత పశ్చాత్తాపపడును. పఠాన్‌రుస్తుం పశ్చాత్తాప, హృదయ సంక్షోభముల నొకరసవత్తర దీర్ఘ స్వగతమునందు శ్రీనివాసరావుగారు ద్యోతకముజేసిరి. ఈ దీర్ఘ స్వగతము బీభత్స భయానక కరుణరసముల కాలవాలము. షేక్స్‌పియర్ విషాదాంత నాటకముల ఛాయలు, భావములు, పాత్రల మనోవృత్తులు రామరాజు నాటకములో అక్కడక్కడ గోచరించును.

ఈ నాటకం హిందూ, ముస్లిం విద్వేషముల రెచ్చగొట్టగలదను యభిప్రాయముతో నాటి బ్రిటిష్ ఇండియా ప్రభుత్వమీ

నాటక గ్రంథమును, ప్రదర్శనమును నిషేధించినది. తరువాత కాంగ్రెస్ ప్రభుత్వము ఈ నిషేధమును తొలగించినది. మరలా దీని పునర్ముద్రణ కాలేదు. ఈ నాటకమిప్పుడు లభ్యమగుటలేదు.

పఠాన్ పశ్చాత్తాప దీర్ఘ స్వగతంనుంచి మచ్చుకు—"... కల్పాంత సమయావిర్భూత ఫాలలోచన ఫాలభాగానలసహస్రము నైన భరింపనగును గాని యీ నా బాధ దుర్భరము. కాకోదర లోకేశ ఘోరఫూత్కారసముద్భవ తీక్ష్ణ కాకోల కీలా శతంబులు మ్రింగి సైపనగును గాని నాయీ బాధ దుర్వహము. ఆహా! ఎటు సైపుదు!"

తరువాత వచ్చిన అనేకనాటక రచయితలు ఈ దీర్ఘ స్వగతాన్ని ఒరవడిగా పెట్టుకుని రచనలు సాగించిరి.

శ్రీనివాసరావుగారి రచన లన్నింటిలో మేల్బంతి యైనది. వా రాంగ్లేయభాషలో వ్రాసిన Dramatic history of the world" (ప్రపంచ నాటక చరిత్ర మను నాటకశాస్త్రగ్రంథము) ప్రపంచములోని వివిధ దేశములందలి నాటక సంప్రదాయములు, నాటక రీతులు, ప్రాక్పశ్చిమ నాటకరీతులలో భేదములు, గొప్పనాటక కర్తల ప్రతిభా విశేషములు, భరతశాస్త్రము, దాని సాంకేతి కార్థము మొదలగు విషయముల నెన్నియో విపులముగ జర్చించియున్నారు. గ్రీకుల దండయాత్ర మొదలుకొని, యాంగ్లేయుల పాలనము వఱకు గల కాలములో భారతదేశము పర పాలనము క్రింద నున్నను, భారతదేశమునందలి నాటకకళ అన్యదేశ కళామిశ్రితముగాక యున్నదని వ్రాసియున్నారు. ఈ గ్రంథ మిప్పుడు ప్రచారములో లేదు.

## చంద్రగిరి అభ్యుదయమునుండి కొన్ని పద్యములు.
(రచన:— 3—8—1916) మొదటి ముద్రణాకాలము:—1925

సీ. కమనీయకల్హార—కలహంస కలితంబు
విమలాంబు కాసార—విశ్రుతంబు
అందమౌకురువింద—మందారమహితంబు
సుందర మాకంద—సురుచిరంబు
కంకేళి కేతకీ—కదళీకసిద్ధంబు
కాంత కాంతల కను కాంచనంబు
మధుసుధారసపూర—మధురాంబు సారంబు
నారికేళాదిక—నగయుతంబు

గీ. మందమారుత కందళ—మానితంబు
కుంద కుట్మల బృందోప—సుందరంబు
నంద నంబున కంటె నానందదంబు
నందమగునౌర ! యీవనమందిరంబు.

సీ. రాజయిచింతచే—రోజుచుండగనేల?
భోజనంబునకింత—భూమిగనదె?
ధారణీధవుడయి—తపియింపగానేల?
దారిద్ర్యుడీధర—దనివిఁగనదె?
క్షితినేలి శాత్రవ—తతికి భీతిలనేల?
నిరుపేదనిర్వృతి—నిదురగనదే?
ఇలకునేలుచు చాలఁగలిమిగోరగనేల?
యిలనుదున్నెడువాడు కలిమిగనదే?

గీ. దొరతనము, వీపునవెయుండు—దుఃఖతమము
ధరణిపాలుర భోజ్యము—దురితతమము
అన్నిఁదెలిసియు మూర్ఖుఁడనైతి నకట!
రాజగుటకంటె—బిచ్చాలవాజుమేలు,

ధర్మవరం—కోలాచలం:

ఆంధ్రనాటక పితామహుడు 'సరసవినోదినీసభ' యను నాటకసభను బళ్లారిలో స్థాపించియుండిరి. ఆ సభకు వారధ్యక్షులు. ఈ సభకు పోటీగా 'సుమనోరమసభ' ను స్థాపించి. కోలాచలం శ్రీనివాసరావుగారు, దానికధ్యక్షులైరి.

ఆచార్యులవారు, పౌరాణిక నాటకములు వ్రాయగా, రావుగారు సాంఘిక, చారిత్రిక నాటకములను రచించి, ఖేలనముగావించిరి. మొత్తము వీరు 28 నాటకములను వ్రాసిరి.

1905వ నాటికి బళ్లారిలో పక్కానాటకశాలలేదు. వెదురుపాకలోనే, నాటకాలాడుచుండిరి. శ్రీనివాసరావుగారు 'వాణీవిలాస నాటకశాల'ను నిర్మించి భారత జాతీయ మహానాయకుడైన బాలగంగాధరతిలకు గారిచే ఆ నాటకశాలను ఆవిష్కరింపజేసిరి.

కోలాచలం శ్రీనివాసరావుగారు దేశ చరిత్రలోని సంఘటనల నితివృత్తములుగా గైకొని నాటకములను రచించి, 'యాంధ్రచరిత్ర నాటక పితామహు' లని వాసిగాంచిరి. ఆంధ్ర నాటక పితామహులు ఆంధ్ర చరిత్ర నాటక పితామహులు,వీ రిద్దరివలన యాంధ్రనాటక కళ తన జీవితమును మూడు పూవు లారు కాయలు గావించుకొన్నది. ఈ కవిద్వయము నాటక కళాభివృద్ధికిఁబాటు పడుటకు. భాషాసేవ చేయుటకు రంగస్థలమైన బళ్లారిపుర మెంతయు ధన్యమైనది.

నాటకములు, ప్రహసనములు, కావ్యము, విమర్శనలు, చరిత్ర, వేదాంత విషయములు మొదలగు సారస్వత శాఖలలో పరిశ్రమించి, యఖండకీర్తి నార్జించి 23 – 6 – 1919 వ తేదీ

నాడు, కోలాచలం శ్రీనివాసరావుగారు రాచకురుపు కారణముగా భౌతికదేహమును వీడి యశోమాత్రశరీరులై యలరారుచున్నారు. ఆంధ్రదేశ మిప్పుడు వారిని విస్మరించినది ఇప్పటికైన వారి కీర్తి కంజలి ఘటించినచో నదియు నొక కళారాధనా విశేషమగునుకదా!





'కావ్యతీర్థ-''పురాణతీర్థ-విద్వత్కవి

## శ్రీ జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ





జన్మస్థలము:—అనంతపురం జిల్లా—తాడిపత్రి తాలూకా గాండ్లపాడు.

జననము :— 11-11-1899

నిర్యాణము :— 18-11-1972

తల్లి :— సీతమ్మ

తండ్రి:— సుబ్బయ్యగారు

మతము;- హిందూ—సంపన్నవైదిక బ్రాహ్మణ-కాశ్యపస గోత్రజులు.

విద్యాభ్యాసము:—

తండ్రిగారి సంతానమున వీరు జ్యేష్ఠులు, తండ్రిగారి పరమపదానంతరము కడప పట్టణమున మాతామహులైన మామిళ్లపల్లి సీతారామయ్య గారి యింట విద్యాభ్యాసము నడచినది. బ్రహ్మశ్రీ అనుముల వేంకటసుబ్బావధానుల వారివద్ద వేదవిద్య,ఋగ్యజుస్సు

లందు స్మార్తకర్మల పాఠముల నభ్యసించిరి. కడప పట్టణమున బ్రహ్మశ్రీ కావ్యస్మృతి జనమంచి శేషాద్రిశర్మ [పెద్దశర్మ] గారి వద్ద కావ్యపఠనముజేసిరి. 1915 లో కాశీమహాక్షేత్రమునందు వ్యాకరణ శాస్త్రము నభ్యసించి 1916లో విజయనగర సంస్కృత కళాశాలలో విద్యార్థిగాఁజేరిరి.

ఉద్యోగ వివరములు:

1917లో బద్వేలు మాధ్యమిక పాఠశాలయందు తెలుఁగు పండితులుగా బనిచేసిరి. 1918లో శ్రీ పెద్దశర్మగారివద్ద జ్యోతిష భాగము నభ్యసించుచు కడప పురపాలక ఉన్నత పాఠశాలయందు సహాయాంధ్ర పండితులుగాఁ బ్రవేశించిరి. 1920 నుండి పంచాంగ సిద్ధాంతమును ప్రారంభించి పంచాంగ మున్ప్రణమును నడిపిరి.1923 లో కలకత్తా సంస్కృత పరీక్షలలో "కావ్యతీర్థ"1924 లో "పురాణ తీర్థ" 1927లో మద్రాసు సర్వకళాశాల (యూనివర్సిటీ) యందు. "విద్వాన్" పట్టములను వడసిరి. 1960 వఱకు, కడప పురపాలకోన్నత పాఠశాలయందు ప్రధానాంధ్ర పండితులుగా, పనిచేసి పదవీ విరమణ వడసిరి. విద్యార్థులలో భాషా జ్ఞానమును, రచనాశక్తిని పెంపొందించుటకై వారు ప్రతియేట నాలుగుసంచికలను ప్రచురించిరి. ప్రతియేట విద్యార్థిసంఘముచేత పోతన జయంత్యుత్సవములను నిర్వహింపజేసిరి. విద్యార్థులు వీరిపై ప్రేమాదరములు చూపువారు.

కుటుంబ చరిత్ర:—

వీరికి ప్రథమమున శ్రీజనమంచి శేషాద్రిశర్మ (పెద్దశర్మ) గారి సహధర్మచారిణిసోదరి యొక్క వివాహముతోగృహస్థధర్మము ప్రారంభమైనది. ఈ ప్రథమకళత్రవియోగము 1942లో జరిగినది. తర్వాత ద్వితీయ వివాహము జరిగినది. వీరికి 6గురు స్త్రీసంతానము

1918 నుండి, కడప పట్టణమునందే స్థిర నివాసమేర్పరచు కొని, 'శ్రీలలితావిలాస' మనుగృహమునందు జీవితమును నడపిరి లలితోపాసకులు, పాదుకాంత దీక్షాపరులు. స్వగృహముననే, ప్రతి వత్సరము శరన్నవరాత్ర పూజలు దీక్షతో నిర్వర్తించుకొనిరి. శాస్త్రాధ్యయన సంపన్నులు, నిరాడంబర జీవులు.

త్రిస్కంద జ్యోతిషము, వ్యాకరణము, ధర్మ శాస్త్ర కృషి జాతక ముహూర్త భాగములు, క్రియా పరిశీలనమునందు, వీరికి మంచి ప్రవేశముగలదు.యాచించిన శిష్యకోటికి, కావ్య.జ్యోతిష, స్మార్త కర్మలు పాఠములుచెప్పుట, వీరికలవాటు. ధర్మశాస్త్ర విచార సందర్భమునందమవాదమే సిద్ధాంతముగాం బరిగణింపవలెననే. అభి ప్రాయములేని సరళస్వభావులు కార్యాకార్య సిద్ధాంత, విచారము లందు, శాస్త్రాధారములజూపి తెలియ జెప్పుటలో వీరికిగల గ్రంథా వలోకన శాస్త్రానుభవము ప్రశంసనీయమైనది.

వీరిరచనలు:—

1) దేవీభాగవతము. (బృహద్రచన) 2) లలితాంబా శతకము 3) సమాసాలంకార ఛందోదర్పణం. 4) ఆంధ్రవ్యాకణ సంగ్రహము. 5) దశావతారములు. 6) పదిపైగా శతకములు పెక్కుదండకములు 7) అనేక శతకములపరిష్కర్త 8) 40ఏళ్లుగా పంచాగముల ప్రకటించినారు. 9) అద్భుతోత్తర రామాయణము. 10) బ్రహ్మఖండము (ఆంధ్రీకరణము 2000 పద్యములు)

## లలితాంబ శతకము

(వావిళ్ళ ప్రెస్సున 1926 లో ముద్రితము)

## కొన్ని పద్యములు

కం. శ్రీమద్దివ్య మునీంద్ర
స్తోమ వినుత భవ్యచరణ-తోయజ యుగళా!
కామితకల్పకవల్లీ!
శ్రీమహిత, మనోజ్ఞరూప! శ్రీలలితాంబా!

కం. శంకరు, నతజనభక్తి
శంకరు, నిఖిలాఘపటల—శమకరునెపుడుఁ
గింకరుడనై, భజించెద
హ్రీంకారిణి! చిత్తమందు-శ్రీలలితాంబా!

కం. భజియించు వారికెల్లను
త్రిజగంబులఁగీర్తి వెలుగ-దీవన లిడి,యో
గజగౌరి! భక్తులకుఁదద
రి జయము నొడగూర్తు వమ్మ—శ్రీలలితాంబా!

కం. శ్రీచక్ర మధ్యవాసిని
యాచకజనకల్పవల్లి—హరవామాంగీ!
మోచనివి భవమునకు,గౌ
రీ చరణస్మరణపీడ–శ్రీలలితాంబా!

కం. ధనమదమునఁ గన్నుంగా
ననివారి యకార్యముల మనంబుననెటులఁ
మననంబొనర్తువో? గౌ
రి!నిత్యమిదియెంచు చుందు—శ్రీలలితాంబా!

కం. కృష్ణ,సహోదరివయి,యా
వృష్ణికులంబునను, నవతరించి, యశోద
ధిష్ణవయి, వెలసితివి,మ
త్తృష్ణం దొలగింప వమ్మ—శ్రీలలితాంబా!





కవిశేఖర—కవిత్వవేది

# శ్రీయజమాన కల్లూరు వేంకటనారాయణరావు

B. A., L. T.,

M. A. కన్నడ & తెలుగు

జననము:— 6–3–1902

జన్మస్థలము:— మరూరుబండ మీదపల్లె. అనంతపురం తాలూకా. అనంతపురం జిల్లా.

తల్లి:— శ్రీమతి కె. లక్ష్మమ్మ.

తండ్రి:— శ్రీకల్లూరు యజమాన సుబ్బరావుగారు.

మతము,కులము:— హిందూ, బ్రాహ్మణ-బడగనాడు వశిష్ఠగోత్రము. భాగవత సంప్రదాయము.

## విద్యాభ్యాసము

1) సంస్కృత విద్వాన్ ప్రిలిమినరీ 2) యం. ఎ. (కన్నడ & తెలుగు) Madras Presidency medalist in B. A. ఆంధ్ర, గీర్వాణ,ఆంగ్ల,కన్నడ భాషలను వీరు బాల్యమునుండియు నేర్చిరి. నాలుగు భాషలయందును వీరికి పాండిత్యముగలదు.

కుటుంబ చరిత్ర:—

కవిగారు స్వగ్రామమైన 'కల్లూరు' (హిందూపురం తా॥

అనంతపురం జిల్లా) బాల్యముననే వదలి, అనంతపురము చేరుకొన్నారు. ముగ్గురన్నదమ్ములలో వీరు జ్యేష్ఠులు. వీరి తండ్రిగారు చాలాకాలము ప్రాథమిక పాఠశాలలయందుపాధ్యాయులుగాను, పోస్టు మాష్టరుగాను (అనంతపురం తా॥ జిల్లా) 'ఆత్మకూరు'నందుండిరి. కవిగారికి ప్రస్తుతము పోయినవారు పోగా ఒకపుత్రుడు, [redacted] ముగ్గురు పుత్రికలు కలరు.

ఉద్యోగ వివరములు

1925లో వీరు ఎల్. టి. ఉపాధ్యాయులుగ అనంతపురములోని బోధనాభ్యసన పాఠశాలలో నియమితులైరి. 1932 సం॥ తరువాత వీరు స్కూళ్ళ డిప్యూటి ఇన్‌స్పెక్టరుగ పనిచేసిరి. తరువాత 1948 మొదలు 1956 వరకు జిల్లా విద్యాశాఖాధికారిగ పనిచేసిరి. సర్వీసుముగియక మునుపే విశ్రాంతులైరి.

ఆధ్యాత్మికోపాసన

వీరు గాయత్రీ, ఆంజనేయోపాసకులు. చిన్నతనమునుండియు, ఆధ్యాతిక చింతనగలవారు. వీరికి జ్యోతిశ్శాస్త్రమునందును, మంత్రశాస్త్రమునందును, నమితమగు చొరవగలదు. ఓషధీవిజ్ఞులు. బాల్యమునుండియు వీరు భవిష్యద్విజ్ఞాన వాణినికలిగి యున్నారు. వీరు గాయత్రీ మంత్రతత్పరులై, కలరామున్నగు వ్యాధులచే, గాసిలు వారిని ధ్యానముచే బాగుచేసిరనియు, వీరి సలహానను సరించి గ్రుడ్డివారికిచూపు వచ్చెననియు, అనేకులకు సంతానమును, ఋణ విముక్తి మార్గమును, సుఖజీవితయోగమును, గ్రహబాధితులు వీరి దృష్టిపాతముచేత నిరామయులైరనియు, పెద్దలు చెప్పుదురు. దేవాలయ పునరుద్ధరణమునందును, నూతనాశ్రమ నిర్మాణమునందును,

వీరి కాసక్తిమెండు. ఉద్యోగము చేయునప్పుడే వీరు విసరరాళ్ళపల్లె (గుత్తి తా॥) రైల్వే కొండాపురము (కడప జిల్లా) అనంతపురము వద్ద గుత్తి రోడ్డులో, తడకలేరు గట్టున శ్రీ రాఘవేంద్రస్వామి బృందావనాశ్రమముల స్థాపించిరి. వీరు మంత్రాలయ రాఘవేంద్ర స్వామి చరిత్రను, శ్రీ రాఘవేంద్రస్వామి విజయమను పేర రచించిరి వీరి 'గీతోత్తర భాగవతము' నందు దీనిని చేర్చిముద్రించిరి.

## గుణగణములు:

ముఖస్తుతి, ఆత్మవంచన వీరికి గిట్టవు. క్షణకోపులు; ఖండిత వాదులు. ఎంతటి వారినైన నిర్దాక్షిణ్యముగ మాటలాడగల స్వభావము వీరిది. అంతర్ముఖులు. వీరు పద్యమునుగాని, గద్యమును గాని తడవుకొనక సహజధారలో, యప్పటికప్పుడు జెప్పగల సద్యస్ఫూర్తిగలవారు. చెప్పినది, వ్రాసినది సాధారణముగ సవరించుట కిష్టపడరు. అందొక సహజమగు బిగియుండును. ఇది వీరి కవితా గుణసంపద.

## సాహిత్య పరిచయము:—

తమ 'పుష్పాంజలి' పీఠికలో కవిగారు తమకు సాహిత్యముపై, మక్కువెట్లేర్పడినదో వివరముగా నిట్లు వ్రాసుకొన్నారు.

'ప్రమాదో—ధీమతామపి' యను, నార్యోక్తి, సుప్రసిద్ధము గురుసన్నిధిని, నేర్వక స్వీయ పరిశ్రమముచే, నించుకంత, కవిత నభ్యసించి నట్టియు, భాషాపాండిత్యములేనట్టియు, నేను రచించిన కృతులు దోషరహితంబులనుట, పొసగ నేరదుకదా. నా 14వయేట విజ్ఞాన చంద్రికా గ్రంథమండలివారి బహుమతి కాశపడి, ధనా

భావలోభములే పురికొల్ప, తెనుగు గ్రంథములు చదువఁదొడఁగితిని. మండలివారి ప్రథమ పారితోషికమగు, నూటపదార్లు రూ. 116-00 నాకు 1916వ, సంవత్సరమునందే,శ్రీ టి. శివశంకరము పిళ్లెగారి,ప్రోత్సాహ ఫలితముగ లభించినది. దీనిచేఁగొంతయుత్సాహము ప్రబలి, బాలకవులెల్లరవలెనే, గీత కవిత్వము, నవలానిర్మాణములకు దొరకొంటిని. వీనియందు, నాకెందుకోగాని, విశేష మభిరుచిలేదు. భారత, భాగవత కథారంగములఁగైకొని తొలుత 'కృష్ణార్జునీయము' అనునాటకము రచించితిని. శ్రీ సత్యనారాయణ మాహాత్మ్య మారంభింప నదియు 5-6నెలలకు, నా 17వ ఏడు నిండునంతకు, 1919 మార్చినెలలో సమాప్తమైనది. దానిని శ్రీయుత పేరనార్య కవిగారికిఁజూపింప, వారాదరింపకయు, నిరసింపకయు, తటస్థభావముతో, గ్రంథము కొన్నినాళ్లుంచుకొని, "ధారాసౌలభ్యము" గుదురించు కొనుమని సెలవిచ్చిరి.అనంతరము దానిని మాదత్తమండల కళాశాలా పండితులు, భాషాబోధకులునగు బ్రహ్మశ్రీ వేంకటరామాశాస్త్రులు గారికిఁజూప,వారు సంతసముతో కొన్నిదోషములను సంస్కరించు తెరువుఁజూపి కృతిపైవారికిఁగల యభిప్రాయమును దయచేసిరి.అంత వరకును చలివిడుగలేదు. నాకు వచ్చినట్లు నేనల్లగలనను ధైర్య మాతర్వాతకల్గి, 1921 లో సహల్యాసహస్రాక్షీయమను నాటకమును, 1922 లో విజయనగర సామ్రాజ్యమును రచించితిని.ఈ మధ్య శ్రీయుత దోమా వేంకటస్వామి గుప్తగారి యభినందనములును, శ్రీయుత రాళ్లపల్లి గోపాలకృష్ణశర్మగారి సందర్భ పదశుద్ధులు, ముఖ్యములగు హితోపదేశములును, కొంతయుత్సాహమునుఁ గల్పించినవి. సాంసారిక కష్టపరంపరలచే జగదనుభవ మెక్కుడగుకొలదిని, రసపిపాసయు కవిత్వాభిలాషయుఁదగ్గఁజొచ్చినవి. ఈ కాలములో ఆంజనేయకళామాలిక, రచితమయ్యెను. క్రమక్రమముగా కవిత

వ్రాయుటకే మనసొగ్గుచుండలేదు. ఇట్టితరుణమున కళాశాలకాలము నంజదివి సేకరించియుండిన విషయముల నొకచోఁజేర్చి. "ఆంధ్ర వాఙ్మయసంగ్రహము"ను పేరనొక విమర్శన గ్రంథమును 1926లో వ్రాసితిని. దానిని వావిళ్లవారచ్చొత్తింతుమనిరి. వారికివ్వ వారేండ్లు గడపిరి. అమధ్యనామిత్రులు ముద్రింపించెదమనిరి. ఆంధ్ర ప్రచారిణీ వారునడిగిరి. మూఁడేండ్లపైన, శ్రీవావిళ్ల వేంకటేశ్వర్లు గారు దానిని ముద్రించిరి.

## వీరు రచించిన గ్రంథములు. ముద్రితములు.

1) పుష్పాంజలి (1929లో ప్రకటించిరి) 2) అహల్యా సంక్రందనము (నాటకము-1921) 3) శ్రీ కృష్ణార్జునీయము 4) శ్రీ రాఘవేంద్రస్తోత్రము 5) ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము. 1926 6) శ్రీ శాంతిసమార్పిట్టు-అశోకచరిత్రము-శ్రీ శ్రీ కల్లూరు సుబ్బారాయ షష్ట్యత్సవసత్కృతి 1958లో ముద్రణము. 7) శ్రీ వీరేశలింగయుగము 1965లో ముద్రణము. (19వ శతాబ్దపు ఆంధ్ర వాఙ్మయ చరిత్రము) 8)శ్రీ విద్యారణ్య చరిత్రము(1959) 9) శ్రీ గీతోత్తర భాగవతము VOL I. (కలియుగాది చరిత్ర కబీరు నానక్ గాథలు, మఱియు శ్రీ రాఘవేంద్రస్వామి విజయము 1974.) 10) సాధనామృతము 12) షాజహాను 1960 12) The Message of the Past And India 1964 (English) 13) పంపాభారత సంస్కృతి (Kannada-1971)

## అముద్రితగ్రంథములు

1) షడ్దర్శనములు 2) ఇస్లాము తత్త్వమంజూష 3) అవిధేయ తనయ చరిత్రము. 4) ద్రావిడభాషామూలము 5) ఆధ్యాత్మిక రామాయణము.

'ప్రతి దినము మనమాచరించు సంధ్యావందన సంస్కృత శ్లోకములను ఆంధ్రీకరించి, 'సంధ్యోపాసన' యని పేరిడిరి. అందలి గాయత్రి మంత్రమునకు తెనుగు నేత

గాయత్రి ధ్యానము.

సీ॥ ఏదేవి తేజమహీన కాంతులఁదుల
దూగు సన్మౌక్తిక ద్యుతులతోడ
ఏధవళాస్యనేత్రేందీవరములు, వి
ద్రుమనీలహాటక రుచులఁజల్లు
ఏమూర్తియభయాంకుశేద్ధగదాచక్ర
ముల, దయా వర దానములనుఁగురియు
ఏశక్తి మకుటంబు నెల్లెడ రత్నాంత
రనిబద్ధవిధునితో రమణ సూపు
గీ॥ ఏమనీషిణికరములనెపుడుదాల్చు
సుందరారవిందంబుల, సొబగుమిగుల
అట్టియవ్యక్త వ్యక్తిని నాత్మనరసి
కలిత తత్త్వార్థ వర్ణనుఁగొలుతు భక్తి

కావ్యపరిచయము:-

శ్రీ శాంతి సామ్రాట్టు—అశోకచరిత్రము. ప్రచురణ: 1958

అశోక చరిత్రము పరమాద్భుతమైనది. ఇంతవర కశోకుని గురించి వచనగ్రంథములును వచ్చినవి. పద్యప్రబంధములునువచ్చినవి. అశోకజీవిక కథాఘట్టములను గైకొని రచియింపబడిన నాటికలును నాటకములును గలవు. కాని ఈయశోక చరిత్ర ప్రబంధ మనేక విధముల విశిష్టమైనది. వివిధ వాఙ్మయముల వలన దెలియ నగు గాథలేవియు అశోకుని సమగ్రజీవితమును విశద పరుపవు.

సరికదా.పరస్పర విరుద్ధములగుట వానికైక్యములేదు.వానినన్నిటిని ఆ మహారాజు ఘనతకు దగినట్లు, కార్యకారణ సంబంధమును గల్పించి, తెగి వేనికవియే విడివడి చెదరిపోయిన హారములోని వివిధవర్ణముల మణులవంటి వాని నన్నిటిని కలియ జేర్చి కూర్చి, శ్రీ వేంకటనారాయణరావుగారు ఈ యశోక చరిత్ర మను రత్న హారమును రమణీయమగురీతిని. కడు నైపుణితో, పరిబంధించి, పాఠక లోకమునకందిచ్చినారు. అశోకచరిత్రమును నిబంధించునది యొక దివ్యప్రబంధము.శ్రీ వేంకటనారాయణరావు తమకావ్యకళానైపుణిని,వట్టి పేలపిండివలె నీరసమైన చరిత్రకు, జీవముపోసి, షట్కాండాంచిత రసవన్మధుర ప్రౌఢ నిర్వాదన కావ్యముగ వెలయించినారు. ప్రతికాండమును ధారోప విభాగ శోభితము ఏతత్కావ్యావతారికయే ఒక విచిత్రపారిరంభము.—(శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మ.)

స్వతంత్రభారతమునకు ఏకైకధ్యేయము, శ్రేయోరాజ్య సంస్థాపనము. ప్రపంచచరిత్రలో శ్రేయోరాజ్య సంస్థాపకులలో ప్రాతఃస్మరణీయుడు అశోకుడు. అందుచేతనే ఈ యితివృత్తము స్వీకరింపుమని ప్రోత్సహించిన వ్యక్తి, గాంధీయుగమునందలి, అతిరథ మహారథ శ్రేష్ఠులలో నొకరగు పద్మశ్రీ కల్లూరు సుబ్బారావు గారగుట వింతగాదు. శ్రీ కల్లూరు సుబ్బారావుగారి షష్టిపూర్త్యంకముగ నీ కృతి వెలువడుట ముదావహమైన విషయము: నవయుగ నిర్మాతలలో నొకరైన ఆ కల్లూరు వారికల, ఈ కల్లూరు వారి కలము వలన ఇట్లు అక్షరరూపమున, కలరూపు ధరించుట యెంతయు సముచితము.

ఈ కృతిని శ్రీ ఏడుకొండల వేంకటేశ్వరస్వామి వారి కంకిత మొనర్చుచు రాయలసీమ గ్రామజీవితమును వర్ణించిన తీరు రమ్యముగానున్నది,

సీ. మా తుమ్మకొమ్మల—మా రేగుకంపల
మా తాలచేల సంసారపోశవు
మా కుందు వరదలో—మాకుంజరాట్పటి
మా పెన్నధాటిలోఁ జేపుఁ చలువ
మా తరీకయ్యల—మా నల్లరేనాట
మాచౌడునేలలో—నేఁచుకలిమి
మాగండ శిలలపై—మాగండుగుండెల
కాఁపులలోని విక్రమపు బలిమి

గీ. మా తనకలాట, కపిలెల మాఱుమ్రోఁగు
గీతములలోని వేదాంత—మూఁతసీకు!
ఎసఁగె దెప్పుడు నీవుమా-కేడుగడగ:
నుంకమంకితంబిదియె! శ్రీ వేంకటేశ!

కళింగయుద్ధము.

గీ. కసిమసంగుచు వీరులుగ్రాహవమున
విలయ రుద్రులై, పరులను వీకదాకి
తుండుపడనేయఁదత్తను హింసనముల
దండధరుపోర్రిలుఁగనె మృత్యు తాండవములు

గీ. ఎగిరిపోవు ప్రాణముల లెక్కిడగగాదు
క్రుళ్లు పలలంబు ప్రోవులకొలతలేదు
ధనికులు, దరిద్రులెవరు? కన్గొనగరాదు
మొనగలంచుటంతయు మృత్యువునకెపాదు

షాజహాన్ (ప్రచురణ;1960—చంద్రసందేశము)
(ఈ కావ్యము హిందూపురం శ్రీకృష్ణదేవరాయ గ్రంథ

మాల వారిచే ప్రచురింపబడినది.) 'షాజహాన్' తన చరమావస్థలో శ్రీ కృష్ణ జన్మస్థాన క్లేశము ననుభవింపవలసివచ్చెను. తనకన్న ముందు పరమపదించిన తనభార్య 'ముంతాజ్' జ్ఞాపకార్థమై, ఆగ్రాలో లోకసుందరమైన 'తాజ్‌మహల్' కట్టించెను. ఒకనాటి రాత్రిజరిగి పోయిన కాలకథలన్నియు స్మరించు చుండగా, తనభార్య జ్ఞాపకము నకు వచ్చెను. పరలోకమందున్న ప్రియను స్మరించి ఆ కాశము నందున్న చలువల జేఁనిగాంచి తనభావతరంగముల నతనితో చెప్పుకొని ప్రియురాలితో, తాననుభవించిన శృంగారచేష్టను స్మరించెను. తాననుభవించువియోగ దుఃఖమును ప్రియురాలికెఱింగింప చంద్రుని ప్రార్థించెను. తానుకూడ త్వరలోనే ప్రియ జేరవాంచించెను. ఇది ఇందలి సంగ్రహకథ.

గీ. భోగిచెంగట భోగులు పొలుపుమెలపు
నలపడుటయ నిసర్గమై యమరు రమణి!
కొడుకులకుగూడ తండ్రి దుర్గుణములొలనె
నంతె! దోసంబు నీదియొక్కింతలేదు.

కుమారులు జెడిపోవుటకు తానే కారకుడని షాజహాన్ మదిలో కుంది, తానును భార్యదరిజేరనిట్లు పరితపించెను.

ఉ. చూచితి జూచితిన్ మనసు చొక్కిన ఘట్టములిట్టి వెన్నియో
నోఁచితి నిర్వురైక్యతననూన సుఖాంబుధి నీఁదులాడుటల్
ప్రోచితి వోసుశీల!నను బూర్తిగ గొల్చియు, ముందువోయి సే
వేచరితార్థవై తివిఁక నేనును నీదరి జేరవచ్చెదన్.

గీ. కల్లబ్రతుకను పంటలో కలుపుదీయ
నుల్లమది పల్లవించి ప్రఫుల్లమయ్యెః
అల్లకలవోలె కలగల్పు దెల్లవాఱ
తనువు నీదరి నొరయంగ దల్లడిల్లు.

సీ. ఆకులో నాకునై యణఁగి చేరఁగజూతు
చేరులోననెయది చినుగునేమొ?
తృణ కంకణముగనై తేలిరా గమకింతు
వచ్చులోనను యది విచ్చునేమొ?
జలదాంగ నాంకంబు చక్కనెక్కగణింతు
నదిదాటులోనను యగలునేమొ?
కిన్నెర నాదమై విన్పొంద నంకింతు
నేగులోనను యది వీగునేమొ?

గీ. అల యజంతసుందరియెక్క యానమట్టి
దెగుర నుంకింతు; అనువాయు వేడదెత్తు?
భూతజాతంబు లివియేల? మూలభూత
మాశ్రయించుటె నాయాత్ర కరయలెస్స.

## పానామృతము

ఇందులో 1) ఆంజనేయస్తవము 2) మానసగీత 3) గురూపదేశము 4) భాగవతసంప్రదాయము 5) వివిధసాధన యోగములు అనుశీర్షికలక్రింద శ్రీ కవిగారు పద్యములు, వచనములు వ్రాసినారు.

## ఆంజనేయస్తవము

సీ. శ్రీజానకీజాని-సేవాధురంధర-అంజనాగర్భ,దుగ్ధాబ్ధిచంద్ర!
సామీరి!మారుతి సమవేగ!విజితేంద్రియ!బుధేంద్ర!ఆశ్రితా
స్యాంబుజార్క!
వానర వాహినీ-మానిత సేనాని!అమితబలైశ్వర్య!విమలచిత్త!
విశ్వసన్నుత!మహావీర!నిరంతర-బ్రహ్మచర్యానుభవ!ప్రసిద్ధ!

గీ. రాత్రిచరహంత! హనుమంత! రాణ్ణియంత!
మేరుసమకాయ! నిగమసంహిత విధేయ!
రామదూత! సమస్త వరప్రదాత!
అమరగేయ! కసాపట్టణాంజనేయ!

## శ్రీ కల్లూరు వేంకటనారాయణరావుగారు పొందిన సన్మానములు

1958లో, అనంతపుర కళాశాలలో జరిగిన సభలో 'అంత రార్థ కళాప్రపూర్ణ, అను బిరుదువడసిరి.

1958, కడపయందు జరిగిన సారస్వత సభలో 'కవితా తపస్వి' యను బిరుదు నిచ్చిరి.

1968లో, అనంతపురములో, ప్రభుత్వ సన్మానము 'కవి రాజశేఖర'

1968లో అనంతపురములో లలితకళా పరిషత్తు సభలో 'ఆధ్యాత్మిక తత్త్వవేత్త' అనుబిరుదు వడిసిరి.

1969లో, రాయలకళా పరిషత్తు సభలో 'కవితానంద మనోదధి.'

## చేసినయాత్రలు.

ఆసేతు హిమాచలం, రామేశ్వరాది అయోధ్య కాశీలతోకూడ, బదరీ నారాయణవఱకు, మూడుసార్లుతిరిగి, శ్రీ శైల హంపీ క్షేత్రములలో తపస్సు చేసినారు.

'నిక్కమైన మంచినీలమొక్కటిచాలు—తళుకుబెళుకురాళ్లు తట్టెడేల' యన్నట్లు వీరు నీలమువలె ప్రకాశించిరి. వీరికి 'భోజరాజు'-'కవిత్వవేది'-బోధార్షేందు-'స్వామి నారాయణ'యను లేఖినీ నామములుగలవు. రాయలసీమలో వెలసిన రాణాప్రతాపసింహ చరిత్ర, శివభారతమునకేమాత్రము తీసిపోనిది వీరి అశోక సామ్రాట్టుచరిత్ర. ఇయ్యది అఖిలభారత సాహిత్య అకాడమీ వారు సన్మానింపదగిన మహాకృతియని శ్రీనిడదవోలు వేంకటరావుగారు పలికిన పలుకులలో పొల్లులేదు. ఆ భాగ్యము మన కవిశేఖరుల కందుగాక!





బ్రహ్మశ్రీ, అభినవ, ఆంధ్ర
వాల్మీకి, కళాప్రపూర్ణ
కావ్య స్మృతి తీర్థ

**జనమంచి శేషాద్రిశర్మ**

జననము:— **4–7–1882**
నిర్యాణము:— జూలైనెల **1950**

తల్లి: శ్రీమతి కామాక్షమ్మ
తండ్రి: శ్రీ సుబ్రహ్మణ్యశర్మ
జన్మస్థలము: కడప జిల్లా, బద్వేలు తాలూకా వెంకటరామపుర అగ్రహారము.
మతము కులము: హిందూ-వైదిక-బ్రాహ్మణ-తెలుగు నాటిశాఖ కాశ్యపసగోత్రులు.

వంశచరిత్ర:

వెంకటరామపుర అగ్రహారమునందు జనమంచి వంశములో సూర్యనారాయణ సోమయాజి కలడు. ఇతని కుమారుడు శ్రీ వెంకటేశావధాని. ఇతని భార్య పేరమ్మ. ఈ దంపతుల కిద్దరు కొమారులు కలిగిరి. జ్యేష్ఠుడు శ్రీ సుబ్రహ్మణ్యశర్మ. రెండవ కుమారుడు శేషశర్మ. ఇతని కొమారుడే మనకవిగారైన జనమంచి శేషాద్రిశర్మ.

కుటుంబ చరిత్ర:

ఈ కవిగారికి సంతానములేదు. వీరి దత్తపుత్రులు శ్రీ శివకుమారశర్మ కడపలో ఉపాధ్యాయులుగా నున్నారు.

విద్యాభ్యాసము—ఉద్యోగము.

ఎనిమిదవఏటనే, శేషాద్రి శర్మగారి తల్లి గతించెను. తండ్రిగారు వారణాసికి వెళ్లిపోయిరి. 1893 లో కవిగారు కూడ కాశీచేరి, అచ్చట చక్కగా సంస్కృతమును నేర్చుకొనిరి. కావ్య వ్యాకరణముల నభ్యసించిరి. మరల ఆంధ్రదేశమునకువచ్చి 1904 సం॥లో విశాఖ పట్టణమున, ఆగమ గణిత శాస్త్రములను, యోగ సాంఖ్యాది శాస్త్రములను, శ్రీ దాసాచార్య పండితులవద్ద

ఛందో వ్యాకరణముల నభ్యసించిరి. 1901లో కడప మునిసిపలు హైస్కూలులో, ప్రధానాంధ్రోపాధ్యాయులుగాచేరి. ఆ పదవిలో 1937 వఱకుండిరి.

సన్మానములు:

(1) కాశీనగర పండిత సభవారు 'సంస్కృతసూరి' బిరుద మిచ్చిరి. (2) వంగదేశ సంస్కృత మండలివారు 'కావ్యతీర్థ' బిరుదమిచ్చిరి. (3) త్రిలింగ విద్యాపీఠమువారు 'మహాకవి' బిరుదమిచ్చిరి. (4) ఆంధ్ర విశ్వ విద్యాలయము 'కళాప్రపూర్ణ' బిరుదమిచ్చి సన్మానించిరి.

శర్మగారు మంత్ర తంత్ర వైద్య శాస్త్రములందు నిష్ణాతులు. జ్యోతిష ధర్మశాస్త్రములందు వీరిది అసమానపాండిత్యము. శర్మ గారి గ్రంథములచ్చువేసిన 'వావిళ్లవారు' వేలకువేలు రూప్యములు సంపాదించిరి.కవిగారికి ఫలపుష్ప తాంబూలాదులు, పట్టువస్త్రములు మాత్రము దక్కినవి.

శర్మగారి గుణగణములు.

వీరనుదినమును "బ్రాహ్మ" ముహూర్తమున మేల్కాంచి కృత స్నానులై, సంధ్యాద్యనుష్ఠానములదీర్చి పరదేవిని ధ్యాన పద్ధతి నర్చించి, తదానంద సౌఖ్యము ననుభవించిగాని, యొకరితో మాటాడరు. అవ్వలనొక యేకాంత స్థలమునజేరి కవికృత్యముల నెఱవేర్చుకొందురు. పదుకొండు గంటలకా కార్యములనుండి విశ్ర మించి మఱల స్నానాధి మాధ్యాహ్నిక కృత్యములు పవిత్రశ్రద్ధతో జరపుకొని భుజింతురు. మఱల సాయంకాలమున, దేహబాధలు

తీర్చుకొని, స్నాన సంధ్యాద్యనుష్ఠానము లొనర్చి పరదేవీ పద ధ్యానమొనరించి,కొలది గడియలు సద్గోష్ఠినుండి భుజించి సుఖనిద్రఁ జెందుదురు.

వీరు కవిత్వము కొఱకుఁగేవలము సంస్కృత కావ్యనాట కాలంకార సాహిత్యమును మాత్ర మలవఱచుకొన్న వారు గారు. సకల శాస్త్రాభ్యాస జనిత సంస్కార సంపన్నులు. అమూల్యమైన కాలమునొక్క త్రుటి మాత్రమేని వృథపుచ్చువారుకారు.అసత్యము పరవంచనము, డంబము, సోమరితనము. కృతఘ్నతయన్న వీరికిఁగిట్టదు. మితభాషులు. పరమత సహనము గలవారు. కపట మెఱుంగని సరళహృదయులు. సదాచార సంపన్నులు.

శర్మగారి ముఖమండలము శాంతతేజోవిలసితము. మంద హాసమెడబాయనిది. దైన్యమెఱుగనిది, ధనసంపత్తిలేక పోయి నను, గుణసంపత్తిచే మిక్కిలి లెక్కకు రాగల్గిరి

(అధారము జనమంచివారి జన్మ దినోత్సవ సన్మాన సంపుటము)

శ్రీ శర్మగారు రచించిన పద్యకావ్యములు.

(1) హాలాస్య మహాత్మ్యము (స్కాందపురాణాంతర్గతము) 2300పద్య (2) శ్రీ లలితోపాఖ్యానము (1963 ప్ర (3)బ్రహ్మాండ పురాణము (6118 పద్య) (4) శ్రీమద్రామాయణము (24161 పద్య) (5) హనుమద్విజయము (812 పద్య) (6) తాండవ కృష్ణ భాగవతము (5185 పద్య) (7) సర్వమంగళా పరిణయము (2024 పద్య) (8) ధర్మసారరామాయణము (4735 పద్య) (9) కలివిలాసము (1010 పద్య) (10) కౌమారికాఖండము (5040 పద్య) (11) బ్రహ్మపురాణము (12) శ్రీ రామావతార

తత్త్వము (13) శ్రీ కృష్ణావతార తత్త్వము (12 సంపుటములు) (14) శ్రీమదభినవ వాల్మీకి రామాయణము (15) నీతిసింధువు (16) నీతిరత్నాకరము (17) సత్ప్రవర్తనము (18) మనుచరిత్ర పరిశోధనము (19) భగవద్గీత (వచనము) (20) ఉత్తమ మార్గము (భక్తిరస గ్రంథము) (21) విచిత్ర రామాయణము (22) భారత భాగవత, రామాయణములు (23) ఉదయగిరి ముట్టడి (24) కడప మండల చరిత్ర (25) విచిత్ర పాదుకా పటాభిషేకము (26) పాండవజ్ఞాతవాసము (27) శ్రీ రామ వనవాసము (28) విహంగ విజయము (29) భగవద్గీత (వచనము) (30) స్వప్నయాత్ర (31) నీతి కథావళి.

(పై పుస్తకములన్నియు శ్రీ వావిళ్లవారు ముద్రించినారు)

"సర్వమంగళా పరిణయము"

(ద్వితీయాశ్వాసము—హిమవంతుడు పార్వతికి హితముఁ దెలుపుట)

సీ. వ్యాఘ్రాసనంబున - వహియించి, గజచర్మ
ధారియై, విష్ణుపాదమునబుట్టి
నట్టి, గంగను-దలయందుఁదాలిచి,వృష
భంబు, వాహనముగ-(బ్రజలకేవ
గలిగించు చున్నట్టి-యెలుకులు, సువిహార
భూమిగా నొప్పంగ—భూధరాగ్ర
మందు, న్యగ్రోధంబు-క్రిందఁగాపుర మొప్ప
భస్మానురాగంబు—పరిఢవిల్ల

గీ. భూరిభయద భుజంగ—విభూషణాళి
వెలయ నుండును రుద్రుఁడో-వెఱ్ఱితల్లి!
యతని వరియించి యేసుఖ—మనుభవించు
దానవో—యెన్నజాలకున్నాను నేను

ఉ. అన్నులమిన్న! ఫాలమున—నగ్నిమయాంబక మొప్పఁగంఠమం
దన్న నో-ప్రాణవాయువుల—నట్టెగ్రసించు హాలాహలంబు, నా
వెన్నికఁగన్న దుర్విషమదెంతయు నల్లఁగఁజూడనుండు, నా
పన్నగరాజభూషణుని-వారకకోరితివంటి! నిస్సిరో!

శ్రీ ధర్మసార రామాయణము.

---

శ్రీ వావిళ్ల వారు దీనిని 1937లో ముద్రించిరి.

ఇందలికథ రామాయణకథయే. కాని అందందు కవిగారు లోకులకుఁ దెలుపనెంచిన సద్విషయముల కనుగుణముగఁ గొంత మార్చిరి. చరాచరాత్మకమైన ప్రపంచమంతయు గర్మము నకు లోబడినది. కర్మము ననుసరించి శరీరము, దాని ననుసరించియే వాంఛలు కలుగును. కర్మమును బట్టియే సుఖదుఃఖాదులు. దానిఁ దిరస్కరించి పోనెంతవారికేఁదీఱదు. విధియన్నను, గాలమన్నను నదియే.అదియ దైవమని పెక్కుతావుల కవిగారీ రామాయణములో సిద్ధాంతమొనర్చిరి. రావణుడు ముక్తికొఱకు సీతాపహరణమును గావించెనే కాని కాముకుడై కాదని కవిగారు నిరూపించిరి. ఇక్కవి చంద్రుల శైలి నించుక రుచిచూడక మానుట పాడిగాదు.

బాలకాండము 188వ పద్యము.

చం. ఒకతఱి మోహవేగమున—నొక్కనిసత్నిని బట్టుకొన్న, వే
ఱొకతఱి స్త్రీయదారల, మహోద్ధతి నొక్కఁడు బల్మిబట్టి, యీ
డ్చుకొనుచుఁబోవుచుండ, గనుచుꣳ దపియించుచు నుండ
గావలెꣳ
పకపకనవ్వి చేయు గురుపాతక మేర్వగఁజేయుఁబిమ్మటꣳ

సుందరకాండము 63వ పద్యము

ఉ. తావియెలేనిపుష్పము, నితంబిని లేని గృహోత్తమంబు, స
ద్భావము లేనిపల్కు, ఫలభార వినమ్రముగాని భూరుహం
బేవిధి కందనట్టి బహుశేష్టద కర్మమునాగ సర్వభూ
తావితథానుకంపఁగననట్టి గుణావళి నిష్ఫలంబెయౌ

సుందరకాండము 293వ పద్యము

చం. తనపని కన్యకార్యసముదాయము హాని గనంగఁజేయుచుꣳ
ఘనత వహించు కార్యమదిగాఁ దలపోయుచు, నుబ్బుచుꣳదనుం
గనుగొన నీసడించు నరుగాంచి హసించుచు నుండు క్రూర చి
త్తునిఁదలపోయ రాదనుచు దోచెడు నంచు వచించు నిచ్చలుꣳ

(శ్రీ కరణము, కృష్ణరావుగారు—బెవినహళ్లి వారు వ్రాసిన దానిలో సంగ్రహము)

తాండవకృష్ణ, భాగవతము—(దశమస్కంధము)

శ్రీ వావిళ్ల వారిచే 1936లో ముద్రితము. శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు భాగవతోత్తములు. భగవద్భక్తి ప్రతిపాదించు భాగవతమును, పోతనామాత్యునికన్న మిన్నగా రచించి లోకంబును మెప్పింప గల గరువము శర్మగారికి లేదు. ఈ క్రింది పద్యము చూడుడు.

ఉ. బమ్మెరపోతనార్యుడొగి—భాగవతమ్మును, దెన్గొనర్చె; మో
దమ్ములరార దానిఁగవితల్లిజు లెల్లరు సంతసంబు శీ
ర్షమ్ములదాల్తు; రట్టి కృతి—సత్తమమున్ దెనిగించుటేలఁగ
ర్వమ్ముఁనగాక యంచుఁదెగి పల్కకుడీ! బుధులార!
ప్రమొక్కెదన్.

శ్రీ శర్మగారి కవిత్వము నాతికఠిన మృదు మధురమై, శబ్దాలంకార శోభాయమానమై, పండిత పామరజన, హృదయంగమంబై, చదువరుల కానంద మాపాదించుచుండును. పదలాలిత్యంబును, ధారాశుద్ధియు. శయ్యాపాక వృత్త్యాదులును, సముచితంబులు. వీరి కవిత్వమందొక వంతు తెనుగు పదంబులును, రెండు వంతులు సంస్కృత పదంబులుండును. వీరు శృంగారాది రసముల కన్న, భక్తిరసము చక్కగా ప్రదర్శించియున్నారు. శృంగార, వీరాది రసము లక్కడక్కడ మనోజ్ఞములుగా వర్ణింపబడినది.

## అద్భుతరసము

సీ. కనులు విప్పగలేని—కసుగందుగానున్న
యప్పుడే గురుబలంబొప్పమించు
నట్టి పూతనయ క మందుండి, చనుఁబాలు
ప్రాణాలతో, శరీర-బు, వయసుఁ
గాలుండు హరియించు—కరణిఁబీల్చెనుకదా!
మూడు మాసంబుల—యీడునాడె!
శకటంబు క్రిందను—శయనించి తానుండ
పయిఁబడ వచ్చిన-బండినట్టె

గీ. యేడ్చుచుంగాలదన్నంగ—నిద్ధపాద
హతికి నాబండి, తలక్రిందులగుచు గ్రిందఁ
బడుచుఁగూలెను వత్సరప్రాయమలరు
తఱినిగ్రిందను గూర్చుండ—దనుజఁడొకఁడు.

ఇట్లే అన్ని రసములను పోషించుచు పద్యముల వ్రాసినారు.

గోపికా వస్త్రాపహరణ ఘట్టము.

చం.అనృతము నేవచింపనని! యందఱు వీరలెఱుంగుదుర్గనుం
గొనుడు,సుమధ్యలార! యివిగో వసనంబులొకొక్కరే జవం
బున, నరుదెంచి కై కొనగ—బోలును; గుంపుగఁగూడియైనఁజే
కొనదగు దీననెద్దిమది గోరుదురో—యటు చేయగాదగుణ





విద్వత్కవి భూషణ

విద్వాన్ — వేదము
వేంకటకృష్ణ శర్మ

జననము:— 1899

నిర్యాణము:— 1973

తల్లి : సుబ్బనరసమ్మ

తండ్రి: శ్రీ రామయ్య

మతము.కులము:—హిందూ—బ్రాహ్మణులు—స్మార్తులు కౌశిక గోత్రులు. వైదీకులు. ములకనాటివారు వేద కులజులు.
జన్మ స్థలము: చిత్తూరు జిల్లా. కార్వేటినగరము.

కవి వంశాదులు

శర్మగారి తాతగారు శ్రీ వేంకటరమణయ్యగారు. వీరి భార్యామణి శ్రీమతి సుబ్బమాంబ.వీరికి 5మంది కొమారులు. 5వ కుమారుడైన శ్రీ రామయ్యగారు, సుబ్బనరసమ్మను పెండ్లాడిరి. వీరి జ్యేష్ఠ కొమారుడే మన కవి శ్రీవేదము వేంకటకృష్ణశర్మగారు.వీరు తమ 15వఏటనే కార్వేటి నగరమున 'ఆమ్నాయ నిలయ' మనుగ్రంథాలయమును నెలకొల్పిరి.

వీరిపూర్వులు, కార్వేటినగర సంస్థానమునఁ జేరుగడించి, రాజాదరణఁబొందిన మహనీయులు. పండిత పత్రికాండులు. మనకవి గా రుదరపోషణార్థము కడప మండల మందలి, కోడూరులోని మిషనరీలోచేరి క్రైస్తవ గ్రంథముల నాంధ్రీకరించు ఉద్యోగములో చేరిరి. 4 ఏండ్ల తరువాత, మద్రాసుచేరి శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవస్థానమువారి ఉన్నత పాఠశాలలో ఆంధ్రోపాధ్యాయులుగాచేరి, అత్యంత ప్రతిభావంతముగ తమ బాధ్యత నెరవేర్చి 1950లో ఉద్యోగ విరమణ మొనర్చిరి.

కవిత్వము:

ప్రౌఢ గంభీరశైలి. భావసంపద గల్గి పదలాలిత్యముతో గూడిన కవితనల్లగలవారు. వారి రచనలోఁగొన్ని విశ్వవిద్యాలయ పరీక్షలకు పాఠ్య పుస్తకములైనవి. రాష్ట్రీయ పండితోపాధ్యాయ పరిషత్తువారు వీరికి, 'విద్వత్కవిభూషణ'అను బిరుదునొసంగిరి.

## శ్రీ శర్మగారి కృతులు.

ముద్రితములు

(1) సద్ధర్మ ప్రబోధిని. (2) కలి నిగర్హణము (3) ఆంధ్ర పాండవ గీతలు (4) శిష్య నీతిబోధినీ శతకము (5) తోడేటి దొరతనము (6) భక్త కల్పశతకము (7) ధర్మ విమర్శనము. (8) కుందమాల (9) భామినీ విలాసము (10) ఊరు భంగము (11) తేనెసోనలు—3 సంపుటములు. (12) భక్తవత్సల శతకము (13) శ్రీరామ (లక్ష్మి) స్వభావము (14) శ్రీ సోమ శేఖరీయము (సభారంజన శతకము) (15) శ్రీ కృష్ణశాస్త్రీయము(కలివిడంబన శతకము) (16) నెహ్రూ కావ్యము (17) అభినవాంధ్ర కాదంబరి (18) శతక వాఙ్మయ సర్వస్వము(సం.I.) (19) శ్రీ ఆంజనేయ కవీయము (చారువర్య)

అముద్రితములు.

(20) పద్మ పారిభృతకము (21) బాల భారతము (22) మహాపురుష శతకము (23) ఝాన్సీ మహారాణి (24)భక్తి యోగము (25) ఆరణ్యకజాతులు (26) తేనెసోనలు (సంపుటి4) (27) మహేశమాల (సంస్కృత శ్లోకములు) (28) విష్ణుమహా మాయావిలాసము (29) బౌద్ధ ధర్మదీక్ష, (30) శతకవాఙ్మయ సర్వస్వము (సంపుటముII) (31) సుభాషిత రత్నమాల.

కవిగారు తమ కులదైవమగు, శ్రీ వేంకటేశ్వరుని సంబోధించుచుఁ జెప్పిన పద్యములలో, వారు వాపోయిన విధమును జదువుచో నెవరికి గుండె నిబ్బరముగ నుండఁగలదు? బంధుగుల నిరసన భావము, దైవదర్శనమునకు ధన శక్తి లేమి-తిరుపతిగొంటి

గింపులు—లక్షలాదికాన్కలు ప్రోఁగగుచున్నను వేంకటపతి భక్తుల కొక్కకానైన నిడమి—మున్నగు ప్రసంగములు దడవి భగవంతుని విస్మరము లాడునంతటి యవస్థకీకవిగారిని అప్పటి పరిస్థితులు ప్రేరేచినవి. క్రింది పద్యములోని కవీంద్రుల నిర్వేదముం గనుఁడు:—

చం. "పరమదరిద్రతాదశకుఁ బాల్పడి, వ్యాధుల బాధల న్నిరం
తరము శ్రమమ్ము నొందుచిటు నాదగు జీవిత మెన్నినాళ్లిలం
జరుపుదు?నింక నేని, నను సాదరదృష్టిని జూడనెంచ,కీ
యరమర లేల చేసెదు?రమాధిప! వేంకటశైల మందిరా?"

వీరికి దీర్ఘకాలముగ నుదరశూల గలదు. ఆపీడ వీరిని వదలినదికాదు. అందులకై యెన్నిచికిత్సలో చేయించుకొనిరి. ఫలము తాత్కాలికాప్యాయమే; వ్యాధి నివారణము మాత్రము శూన్యము. ఆమయమతిశయించి, సంసారపుఁదగులాట మెక్కువైనపుడు వీరి యావేదనము హృదయ విదారకము. చూతుఁడు:

చం. "నలుపదియేండ్లకే తనువునం గడు నీరసభావ మేర్పడెఁ;
నలిగెను సంధిబంధము;ల నంతరుజల్ పయిఁ గానిపించె; దు
ర్బలతఁ గృశించె నంగములు; ప్రాణములుం బరువంచుఁ దోఁచె; నెం
దుల కిటు కష్టపెట్టుదువొ? దుర్జనశిక్షక! సాధురక్షకా!"

ఈ శారీరికానారోగ్యస్థితి యొకవంక బాధించుచుండ, జ్ఞాతులు-బంధుగులు "తాము మాత్ర మూరకుండుటయా?"—యని వీరిని ముప్పతిప్పలు పెట్టి,మూఁడు చెఱువులనీరు ద్రావించి, న్యాయస్థానములకు సయితము లాఁగిరి.

కోడూరుపురమున 1939 వ-సం॥రమున శ్రీ సుగాసి గురవయ్యగారను మిత్రులు నివేశస్థలము నుచితముగ నొసంగ గృహ

నిర్మాణమునకుఁ బూనుకొనిరి. అట్టియెడ నావశ్యకమగు ధనాధికము నీకవిగారికి ఋణమొసంగఁ గొందఱు మిత్రులును శిష్యులును వాగ్దత్తమొనర్చియుఁ దుదకు మొండిచేయి చూపిరి. 25 ఏండ్లు సాంసారిక జీవనము గడపియు వీరికి పుత్రుడు కలుగలేదు. 1945 వ సంవత్సరమున వీరికొక కూతురు జన్మించెను. అప్పుడు లభించిన సంతసము వర్ణనాతీతము ఈమెయే "ఉదయరంజని"

ఒకప్పుడు, 'కీళ్లవాతము' సంభవించి, ఎడమచేయి పైకెత్తుటకు వీలుకాలేదు. అట్టి సమయమున, వీరు డబ్బు పోగొట్టుకొనుట తమ్ముని కుమారుఁడు మృతినొందుట, 'వీరికి ఉదర శూల' ప్రకోపించుట, వెంటవెంటనే సంభవించినవి.

అన్ని ఇడుముల, ప్రశాంత స్వభావముతో, భగవంతునిపై, భారమువైచి కర్మఫల మనుభవించిరి.

సన్మానములు;

ఈ కవిగారిని, కడప జిల్లా రాజంపేటవారు 1961వ సంవత్సరములో శ్రీమాన్ మాడభూషి అనంతశయన మయ్యంగారి అధ్యక్షత క్రింద సన్మానించిరి. ఆ సన్మాన పద్య పంచరత్నములలో ఒకటి తిలకింపుడు.

సీ. అనువాదములొనర్చి-యాంధ్రులడెందమూ
గించినావు; రసాన-ముంచినావు.
బహుళ స్వతంత్ర కావ్యములు రచించిపే
రందినావు; ముదమ్ము-నెందినావు
రాజకీయముల, దుర్వాదములను, విమ
ర్శించినావు; ఋతమ్ముఁబెంచినావు.

అంతే వసద్వర్యులలరఁగై తలను, నే
ర్పించినావు; కృతులఁబంచినావు
భూరి, "విద్వత్కవి-భూషణ" బిరుదమా
ర్జించినావు. యశమ్ము నించినావు
గీ. మేలి, రాయలసీమ, రత్నాలసీమ
యంచు, వావాదులన్నిర్ణయించినావు.
భారతీ పదపద్మ మంజీరరుతుల
గృతుల నినదింపఁజేసి జీవించినావు.

కావ్యపరిచయము

## ఆంధ్రభామినీ విలాసము.

ఈయది అనువాద గ్రంథము. దీనిని సంస్కృతమున పండితరాయలు 'భామినీ విలాస' మనుపేర వ్రాసిరి. "——— ఈ కవి రాజాస్థానములలో నుత్కృష్టతమ మనదగు ఢిల్లీ మొగలుల యాస్థానము నందుండిన వాఁడగుటచే నతని యన్యాపదేశములు ప్రతి మములయినవి. మిగిలిన కథలెట్లున్నను, బండితరాజు ఢిల్లీ మొగలుల నాశ్రయించియుండెననునది నిర్వివాదాంశము. అతఁడు-అక్బరు షాజహానుల కాలములలో జీవించియుండె ననుచున్నారు. షాజహాను కుమారుడగు 'దారా' కుపండితరాయల యందపరిమితమగు నభిమాన ముండెను. కాని, దారా ఢిల్లీ సుల్తాను కాకపోవుట పండితరాజు దురదృష్టమని చెప్పవచ్చును. దారా మరణముతోఁ బండితరాజునకు ఢిల్లీ సంబంధము తెగియుండవచ్చును. పండితరాజు తన వార్ధక్య మును మధురలో గడపి యచటనే మరణించె నందురు.

'భామినీ విలాసము' నాలుగు భాగములుగా నున్నది. అన్యోక్తి సముల్లాసము, శృంగార సముల్లాసము, శాంత సముల్లాసము

కరుణ సముల్లాసములని వాటికి పేర్లు. ఈ నాల్గింటి లోనుకలిసి ౧౯౦ ప్రక్షిప్త శ్లోకములకును, శ్రీ వేంకటకృష్ణ శర్మగారు తెనుగు పద్యముల రచించిరి.

(ఆంధ్రభామినీవిలాసము–ఉపోద్ఘాతము)

అందలి కొన్ని పద్యములిందు పొందు పరచితిమి.

(1950) భామినీ విలాసము–శృంగార సముల్లాసము,

ఉ. రాతిరి యేగుదెంచె నుడురాట్కరముల్ హరిదంతరంబులన్
బూఁతలుపూసె, భామినులు భూషణముల్ ధరియించిరిండ్ల,రో
షాతిశయంబువీడ విసు మంతయు, నింకను, దాననేమగున్?
లేఁత బిసంబుకన్నఁదరుణీ! కృశమై మెయిచిక్కె నక్కటా!

ఉ. బంగరుబొమ్మ! నీవు ముఖవారిజమందు వికాసలక్ష్మిఁదా
ల్పంగని, లేమిఁగీడ్వడుఁగలానిధి, పున్నమ నోలునష్ట, యెం
దుంగడు నీలిమంగలువతోటలలర్చు, దిగంతరంబు లు
ప్పొంగును గాంతితోఁజెలఁగు మోదమునిండ సుహృజ్జనంబులున్

కుందమాల (1948)

(శ్రీ దిఙ్నాగాచార్యకృతికాంధ్రీకరణము)

ఇయ్యది షష్ఠాంకముల నాటకము ఇందులో, కొన్ని పద్యము లిట నుదహరించినాము, లక్ష్మణుఁడు: ఆర్యురాలి కొఱకీ భగవతిని వేడి కొందును.

గీ. కమల గంధ కృతాధి వాసముల, విమల
వీచికానిలముల, శ్రాంతి విసరుమమ్మ!
త్రిషవణస్నానమాడుచో–దేవి! మూర్త
మంబు, వేగంబుఁదగ్గింపుమమ్మ! గంగ!

గీ. ఈ వనంబునంగల యోమునీంద్రులార!
ఇదిగో, కేల్సేర్చి తలను, బల్కెదను మీకు
లేమ, త్యక్త, యశరణ, కులీనయంచు
భగవతి యటంచు, దయఁగనఁదగును దేవి!

గీ. అంజలి, ఘటించి, వనదేవతాళికిదిగో
విన్నవించెద-క్షణమిది వినునుగాక!
నిదుర యందాపదను గష్టమొదవుతరిని
పూన్కి-భగవతులీమె నోముదురుగాత!

గీ. సకులు నదులార! దిక్పతుల్-స్వాములార!
జనని గంగాసహోదరుల్-శైలరాజు
లార! యిదిగో! లక్ష్మణుఁడు పల్కెడు వేఁడు
నృపసుతం గావుఁడీ పూన్కి-నేను జనుదు.





విద్వాన్ కవితానంద, శతావధాని,
అష్టావధానదక్ష.

## శ్రీ సోంపల్లి సంపత్ కృష్ణమూర్తి

జననము: 1913

నిర్యాణము: 29-1-1969

తల్లి: మంగాంబ

తండ్రి: సంజపాచార్యుడు

మతము,కులము: హిందూ—బ్రాహ్మణ స్మార్తులు

నివాసస్థలము:— కొక్కంటి—కదిరి తాలూకా—అనంతపురం జిల్లా

ఉద్యోగము:— 1941వ సం॥ నుండి ప్రధానాంధ్రపండితులుగా కదిరి ఉన్నత పాఠశాలలో పనిచేసిరి.

గురువులు:— విద్వాన్ కవిసార్వభౌమ, అభినవబాణకవి, ఆశుకవి చక్రవర్తి, శతావధాని శ్రీ గౌరావజల రామకృష్ణ సీతారామ సోదరకవులు. అనంతవరం. అగ్రహారం. (నెల్లూరు జి॥)

కుటుంబ చరిత్ర

శ్రీ కవిగారి ఇంటిపేరు సోంపల్లివారు. వీరు శ్రీ రామ చంద్ర, బాలాత్రిపురసుందరీ పాదసరోజ సేవా పరాయణులు. మంగాంబా,నంజపార్వతనూభవులు.'ఉల్చుకమ్మ' యనుతెగకుజేరిన విప్రులు. విశ్వకళాశాలవారి, విద్వత్పరీక్ష యందారితేరి, సంస్కృతాంధ్రములయందుఁ బాండిత్యమును, సంపాదించిరి.

ముద్రితకృతులు

(1) భక్తరక్షామణి (పద్యశతము) (2) అపదుద్ధారక స్తోత్రము (3) వాసవీ విలాసాభి రూపకము (నాటకము) (4) మల్లికార్జునదైవవినుతి (5) రామాస్త్రము (6) పుష్ప విలాసము (7) కవితానంద వాల్మీకి రామాయణము 2సంపుటములు

అముద్రితములు

(1) సతీతిలక (నవల) (2) ఆంధ్ర వ్యాకరణ వివరణము (3) శంకర విజయము (హరికథ ముద్రణము) (4) ఆంధ్ర

సూర్య శతక టీక. (5) దైవజ్ఞ భూషణము (6) సత్యనారాయణ వాచకములు ఐదు. (7) కొక్కొంటిపాశెగారి చరిత్ర

కావ్యపరిచయము

ముద్రిత గ్రంథము కవితానంద వాల్మీకి రామాయణము (బాలకాండము) నుండి కొన్ని పద్యములు. ఈ గ్రంథము 1940 నందు ముద్రింపబడినది.

దశరథుఁడు రోమపాదునకుఁ దన కూఁతురగు శాంతనొసంగుట.

తే. ఆ మహీపతి, హితుఁడైన—రోమపాదు
నకునొసంగెను దనదు శాం—తాకుమారిఁ
దనయఁగా, రోమపాదుండుఁ—దత్కృతమున
కాత్మసంతసమందుచు—నరిగెఁబురికి

మ. ప్రవినీతుండగు రోమపాదునిజరా–ష్ట్రం బందనావృష్టిసం
భవమయ్యెన్–మునిఋష్యశృంగుఁబిలిపిం–పంబూనియా తండు మేల్
జవరాండ్రన్ వెలయాండ్రనాశ్రమము ప_జ్జంజేరఁగా బంపె వా
రవునొనంచు నుతింపఁగాఁదగిన నొ—య్యారంబుదీపింపఁగన్.

కం. అమలవిభాండక మున్యా
శ్రమమును జేరంగ నరిగి—చయ్యన వేశ్యా
రమణులు సంకేతవిలా
సములును మఱినృత్యవాద్య—సంగతులలరన్

తే. శ్రీ విభాండక సుతుఋష్య–శృంగుజూచి
కౌఁగిలించుచు నగవుల—గ్రమవాక్య
ములను సత్కారములఁగడు—మోహ వశునిఁ
జేసియాతనిఁదమవెంట—జేరఁ బిలిచి.

తే. రోమపాదున కర్పింప-నా మునీందుఁ
డడుగు పెట్టిన మాత్రనా—పుణ్యమియందు
మంచివానలు కురిసెన—మంచితముగఁ
బాడి పంటలు పొలుపొందె—భవ్యమహిమ.

కవితానంద వాల్మీకి రామాయణము
(యాత్రా కాండాదికము—ప్రచురణ—1966—67)
—: సీతను లక్ష్మణుడు వనభూముల విడుచుట :—

ఉ॥ అన్నకు మ్రొక్కి-సీత నిలయంబునకుంజని తేరువచ్చె;రా
మన్నయు నీదుకోర్కి కయి-యమ్మ్మనిపల్లెయు వాల్మికాశ్రమం
బున్నపొలాన నిన్విడిచి-యూరికి రమ్మని చెప్పెలెమ్మ; నీ
పున్నెపు పంటయెట్టిదియొ? పూనుమిదే! వదినే!రథంబుపై.

కం. ఆ క్షితిజాతకు నదరెను
దక్షిణనేత్రంబు వఱకు-దరిఁబొరి యఱచెన్
బక్షులవి, యక్రమముగ, స
నుక్షణమును నరదమును గనుంగొనుచరిగెన్.

ఉ. హేతువెఱుంగరామిఁదన హృత్కమలంబు చలింప, మేదినీ
జాత, యిదేమి?లక్ష్మణ!విచారముగల్గెడు నీ ప్రయాణమే
భీతిగఁదోచుచుండె; నడవిన్ శకునంబులు చెడ్డవయ్యె! భూ
నేతకు రామచంద్రునకు నిత్యశుభంబును క్షేమమౌఁగదా!

కం. అనియడుగ, నతనిక్షేమం
బున, కేమి కొఱంతలేదు-పుణ్యాంగనలా
మునిపత్నులె—నిను బ్రోతురు
మనమున నిబ్బరము గలిగి—మసుమ నెనతడున్

## ప్రాఁత—క్రొత్త.

సీ. రాజులరాణుల-రాజ్యసంపదప్రాఁత
సర్వంబునకు, నరాజకత క్రొత్త
హరిహరపూజాదు-లాచరించుటప్రాఁత
హరిజనోద్ధారకులగుట క్రొత్త
అన్నసత్రములలో—నాదరించుటప్రాఁత
అన్నమే యిదనట్టి-యడవు క్రొత్త
వలసిన ధాన్యంబు-గలిగియుండుట ప్రాఁత
తిండిగింజలులేని—స్థితియె క్రొత్త

గీ. కులమతాచారములువిల్వ కొనుటప్రాఁత
కులమతాచారములుకూల్చ-కొనుట క్రొత్త
తారతమ్యము తెలియు వర్తనముప్రాత
తారతమ్యములేని, వర్తనము క్రొత్త

సీ. పరపురుషునిఁగాంచి-తరుణిజంకుటప్రాఁత
పరతృప్తికై వెంటఁబడుటక్రొత్త
ఇల్లాలుతనయింటనిలువ-దుటప్రాఁత.
రచ్చలఁదిరుగాడుమెచ్చుక్రొత్త
బూటకాలకులొంగి పోవకుండుటప్రాఁత
వానికై యలవాటుపడుట క్రొత్త
అలముఖస్తుతిగమాటాడకుండుటప్రాఁత
ముఖనుతివెన్క—దుర్బుద్ధిక్రొత్త

గీ. కార్యమునఁద్యాగశీలముల్ గనుట ప్రాఁత
అవి, యుపన్యాసములయందెయగుట క్రొత్త
చెడ్డచెడ్డదె-మంచి మంచిదియె ప్రాఁత
చెడుగు మంచిది-మంచిది చెడుగుక్రొత్త.



వైద్య విద్వత్పండిత సత్కవి

## నారు నాగనార్య

జననము: 3-7-1903

నిర్యాణము: 18-1-1973

తల్లి:- శ్రీమతి సుబ్బమ్మ

తండ్రి:- శ్రీ నరసింహము.

జన్మస్థలము:- కడపజిల్లా- రాజంపేట తా॥-రాఘవరాజపుర అగ్రహారం (రైల్వే కోడూరు ప్రక్కన)

మతము-కులము:- హిందూ-తెలికకులము

విద్యాభ్యాసము:

నెల్లూరుజిల్లా వెంకటగిరిలోని అష్టావధాని అల్లాడి జగన్నాథ శాస్త్రిగారివద్ద చంధస్సు, అలంకారములునేర్చిరి. శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారివద్ద శ్రీ విద్యోపాసనముగావించిరి.

దేశసేవ:-

వీరు స్వాతంత్ర్య ప్రియులు. దేశసేవాగ్రగణ్యులు. 1921 లో సహాయ నిరాకరణోద్యమమునచేరి, 1924 వరకు నెల్లూరు పల్లపాడు గ్రామములందు సత్యాగ్రహాశ్రమనివాసులై ఖద్దరుసేవచేసిరి. 1923 నందు నాగపుర సత్యాగ్రహిగా జైలుశిక్ష ననుభవించిరి. 1947 నందు 'వ్యష్టి' సత్యాగ్రహమునపాల్గొని చెఱసాలకువెళ్లిరి.

శ్రీమహాత్మాగాంధీ నిర్యాణమువరకు కాంగ్రెసు సేవనొనర్చి తదుపరి కాంగ్రెస్సువదలిరి. 1949 నుండి సాహితీక్షేత్రమున కృషీవలుడై నందనోద్యానవనమును వెలయించిరి.

సాహిత్యసేవ:

వీరికి సంస్కృతాంధ్రము అభిమాన భాషలు. వీరికి కవితా వేశముమెండు. ఏకధాటిగా వందలకొలది పద్యములనల్లెడి శక్తి గలదు. వీరికి అచ్చతెనుగుపై అభిమానముమెండు. అందులకేవారి డెబ్బదికృతులలో ఆ అచ్చతెనుగుకృతులు మేల్బంతులైనవి. భాషాభిరుచిగలవారికవి సరికొ్రత్తవిందులు. వీరు పెద్దన్నగారి మను చరిత్రమును—'మనువుపుట్టువు' అనుపేరను, ముక్కు తిమ్మనార్యుని పారిజాతాపహరణమును-'మెచ్చులపచ్చముర్రిచ్చిలి' యనుపేర సరి యగు యచ్చ తెనుగున రూపొందించిరి. తరువాత ఈ పోకడలోనే మరికొన్ని అచ్చతెనుగు కబ్బములు-శకుంతల, ఊర్వశి, వెన్నెల పెండ్లి, రామకథలు వ్రాసిరి.

గీ॥ నాయెడఁదఁ బొంగువాఱుచున్నది యయారె!
తల్లి బాసగు తెనుఁగున కుల్లమలర
నేమికానుకయిత్తుఁ గెంపెడఁదఁజీల్పఁ
బొడము నెత్తురు పారాణి పూఁతఁదప్ప!

కం॥ పలువురు జదువని వ్రాఁతల
వలనన్ మేలేమి యంచుఁబలుకుట వినియున్
వలనొప్పఁ దల్లి బాసను
బలుకుటఁ దప్పేమియంచు-వ్రాసితి దీనిన్

యని కవిగారు తమ అభిప్రాయమును అచ్చతెనుగు పారిజాతాపహరణమున తెలుపుకొనిరి. ఈ కృతినిగురించి మహాకవి శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రిగారిట్లు వ్రాసిరి.

"———శ్రీ నాగనార్యుఁడు పల్లెలయందే నివసించి, అందలిజనులతో విశేష పరిచయము కలవాఁడైనందున, ప్రాచీన ప్రబంధముల క్షుణ్ణముగా చదివిన వాఁడైనందున, కావ్యజ్ఞ శిక్ష పొందిన వాడైనందున తనరచనకు వలసినంత పదజాలము సంతరింపఁగలిగినాఁడు. తక్కువపడిన దానిని సృష్టించుకోఁ గలిగినాడు అన్నింటిని పులుగడిగి రంగురేకలుదీర్చి మెఱుగులు దిద్ది అందమైన కావ్యశరీరము నిర్మించినాడు. ఈ చేయుటలో చేయివణకుటో, చూపు చెదరుటో, సంధికదలుటో, బంధమువదలుటో యేదైన ఏమఱు పాటుజరిగియుండవచ్చును. అదియు క్రొత్తకాదు. ఇంత కొత్త చేయుచున్నను కవిత సహజముగా సరళముగా కుంటువడక నడచినది. కథాకథనము, భావ చిత్రణము, అలంకార విన్యాసము, మున్నుగా కావ్యసంపద యంతయూ మూలమునకే చెందినదైననూ తనకూర్పులో వానిని యథావిన్యాసముగా పొదుగుటయే యీతని నేర్పు. ఈ విధముగా ఈ నాటికవులలో నాగనార్యుడొక క్రొత్త దారితొక్కి కృతకృత్యుడైనాడు"

మచ్చునకుగొన్ని పద్యములు చూడుడు

మ॥ పనిపాటుల్ విడియూరునాడుఁ దిరుగన్ బాల్వడ్డ బైరాగి పో
రనుతిండిన్ బ్రదుకంగలాడచటికాహా! వచ్చెనా! వచ్చియే
మనిచెప్పెన్ మనయందగాఁడు బదులేమందించెఁగన్గీటి రు
క్మిణి యేమాడెను డాఁప కంతయును గూర్మింబల్కరాదే!చెలీ!

కం॥ దాసానిరంగు చీరఁ
బాసి, వెలఁది మడుఁగుఁగట్టి-పంచల సొమ్ముల్
వేసి, కయిదమ్మిఁదునుకలు
సేసి, చెలిఁగొదుకు బ్రదుకు—జిడిముడిపడుచుఁ

కం॥ సీరున్నకాఱు మబ్బున
జేరిన రిక్కవలె 'సత్య'—చెలువంబఱిపం
చారించి యలుకగీమున
దూరెను సకులలుగఁ జేయుదురుగద! యిట్టుల్

కడప మండలమునజరిగిన యొక ప్రాచీన విషయమునుగై కొని కవిగారు 'వీరపూజ' యనుపేర నొక వీరరసోదంచిత కావ్యమును లిఖించిరి. ఇందు హైందవులకుఁ బ్రాచీనకాలము నుండియు సహజములుగ నుండు వీర్య శౌర్యాదార్యములు చక్కగా వివరింపబడి యున్నది. 'శృంగార వీర కరుణాద్భుతాది రసములనెల్లను నలంకార శాస్త్రమునఁజదివి యుదాహరణముల నెఱుగుటకంటె నీ గ్రంథమునఁజదువుట యే చాలును' అని శ్రీ జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మగారు తమ యమూల్యాభిప్రాయమును నుడివిరి.

వీరపూజయందలి వీరవిహారమెట్లున్నదోకనుడు

శా॥ వాగర్థంబులవోలె నిర్వురొకటై వైరిప్రకాండంబును
ద్వేగాకంపిత దేహవల్లరులరీతిఁ స్వప్రతాపక్రియా
వేగోదీర్ణ బల ప్రభంజనతఁ గల్పింపఁ సముద్దిష్ట దీ
క్షాగర్వంబునలేళ్లపై నుఱుకువ్యాఘ్రంబుల్ వలెఁదూఁకినన్.

కం॥ బలవన్నాగవరంబేఁ
జవిచీమల చేతఁజిక్కిచచ్చినయటులీ
బలియుఁడు మాచే సిలుఁగుల
గలఁగఁడె యిపుడొంటి పాటు గదిసినకతనఁ

మ॥ అనియుప్పొంగుతలంపులఁ బెనఁగు మిథ్యాపౌరు షోద్రేకసం
జలితక్రోధ విఘూర్ణనోత్థచటులోచ్ఛాయ క్రియఁ బ్రాజ్ఞనో
జనితాఖండజయేప్సితార్థ ఫలమిచ్ఛాస్ఫూర్తి నర్థించి, మిం
చిన వేగంబున వీరుపైఁగవిసి నిస్త్రింశోగ్ర ధారాహతిన్.

యుద్ధమెంత వీరోచితముగా జరిగినదో రచనయంతకుమించిన భావోద్రేకము తోడను, భావపుష్టితోడను, యర్థగాంభీర్యముతోడను పదగుంభనముతోడను సాగినదనుటలో యతిశయోక్తి లేదు. ఈ మండలమున వెలసిన రాణాప్రతాపసింహ చరిత్రకు, శివభారతమునకే మాత్రము తీసిపోనిదీ వీరపూజ. ఒకేగడ్డలో పుట్టిన బిడ్డలలో వీరావేశము అడ్డులేక విహరించినదని గట్టిగాజెప్పవచ్చును. వీరి మరొక చారిత్రాత్మికమైన వీరరసకావ్యము శ్రీపృథ్వీరాజవిజయము

కం॥ అదియేమొ? వానికత్తికిఁ
బదునెక్కడనుండి యూడిపడెనో? శిరముల్
బదులును వందలు వేలును
జిదగొదయై త్రెళ్ళిపడుఁ ఖచిక్కనులోనన్

గీ॥ పిడుగు పడునట్లు దండుపైఁబడియవక్రి
విక్రమాటోపమునవైరి వీరసమితి
జొన్నతఱిగిన జెన్నాన సొరిది నఱికి
బీడువడ రణతలమెల్లగాడుఁజేసె.

పై రెండును పృథ్వీరాజవిజయమందుయుద్ధ ఘట్టమున జెప్పబడిన పద్యములు. కవిశేఖరులు నిజముగా వ్యవసాయదారులే. లేకున్న వారికి యుద్ధవర్ణన చేయునప్పుడుకూడా జొన్న చేనుల కోతపైనున్న ధ్యాస తప్పలేదు. ఇది స్వభావికమేగదా!

వీర రసమునెంత చక్కగా వీరుపోషించిరో, అంతే చిక్కగా శృంగారమును సహితము మధించిరి. వీరి 'తిలోత్తమాసాహసికము' 'తిలోత్తమ' 'ఉషారాజ్ఞి'–ధాన్యమాలిని–ప్రణయిని–యెన్నదగిన శృంగార కృతులు "మా పండితుడు, ముసలితనములో నప్సరసలతోడి సంబంధము నెందుకు పెట్టుకొన్నాడో! ముసలి తనముసు రెండవ బాల్యమన్నారు పెద్దలు-" అని 'పుట్టపర్తి' వారన్నమాటలో వింతలేదు. నిజముగా ముసలిప్రాయమున శృంగారముపొంగు ననుట తథ్యముదాని నీకవీశ్వరులు దృఢపరచిరి.

ఉ॥ గుత్తపు పట్టుపైకబిగి కుట్టు పటుక్కునఁ బిక్కటిల్లిస్వా
యత్తముఁదప్పిపోఁబ్రిదిలి యబ్బుర పుబ్బగు గబ్బిగుబ్బలు
వ్రేత్తున నొత్తరించివలపింపఁగవుంగిటనించి పల్లుకెం
పొత్తిలి మోవితేనెఁజవులూరఁగొనెన్"విధుఁ"డా"తిలోత్త
మన్"

ఇది ప్రాచీన కవుల ప్రబంధములందలి శృంగారమునకే మాత్రముతీసి పోలేదుకదా! ఇంత చక్కటి కవిత నెంతమంది కవి పుంగవులు వ్రాయగలరు? ఒక్కరో యిద్దరోతప్ప. కవియిట్టి వాడగుట చేతనే పలువురు వీరి కవిత్వమును ప్రశంసించిరి. శ్రీ జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మగారు తక్కువ వారేమికాదు గదా! అట్టి మహనీయులీ కవినెట్లు పొగడిరో జూడుడు.

"———ఈ గ్రంథకర్త తెలుంగులోకమునకుఁ జిర పరిచితుఁడు. కడపమండలమున శ్రీ శేషాచల సమీపమునఁగల కోడూరు గ్రామ వాస్తవ్యుఁడు. కుంజరనదీ సలిలపాన ప్రభావ సంజనితదివ్యకవితామృతవాగ్విశారదుఁడయ్యు శ్రీవేంకటాచలదివ్య పర్వతసాను విలసిత మహౌషధీ పరిపూత మలయమారుత సేవా సంప్రాప్త సారస్వత రస పరిపూర్ణుడు నారునాగనార్యాభిధానుఁడు. సహజకవితావిచక్షణుడు. ఆర్యవాణీ రచయిత - దేశ సేవా గ్రగణ్యుఁడు. స్వాతంత్ర్య ప్రియుతు. లోకోపకారనిరతుడు. దేశాభిమాని. వైద్యవిద్వరుఁడు. దేవ బ్రాహ్మణ గురుజన భక్తియుక్తుడు. సుకవిత్వలంపటుఁడు. లోకక్లేశాసహిష్ణువు. ఇట్టి సుగుణంబులెన్నియేనిగలవాడు. ఈ మాటలు స్తుతి పాఠములు కావనియు, సహజములనియు, దత్త్వవిదులూహింపక మానరని నా విశ్వాసము." (వీరపూజ—ఆశంసనమునుండి)

ఇంతకంటెను కావలసినదేమున్నది. కవిధన్యుడైనాడు. అతని జన్మకు సార్థకతేర్పడినది. కవికావ్యముల కొకగొప్పవిశిష్టతేర్పడినది. బిరుదులు, సన్మానములు పై వాక్యముల ముందు దిగదుడుపే

యుక్తాయుక్త విచారదశ వచ్చినప్పటినుండియు వీరి బుద్ధి యాధ్యాత్మిక పథము వంకకే యుఱుకులెత్తసాగినది. శ్రీ భగవాన్ రమణ మహర్షులాతని యాత్మ విద్యా జిజ్ఞాసకు మార్గోపదేష్టలు. బాల్య, యౌవన మధ్యకాలమున వీరుత్సహించి, దిగి, లోతు పాతులరయని ప్రాపంచిక విషయములులేవు. బ్రహ్మజ్ఞానార్జనను వీరు త్రికరణశుద్ధిగా విశ్వసించిరి. శ్రీ రమణాభ్యుదయమే వీరి కాత్మానందము. వీరు శ్రీరమణ మహర్షి పావన జీవితమును ధారాశమగు శైలిలో పద్యకావ్యముగ వ్రాసి,యిటు గురుఋణము, నిటు తెనుఁగు వారికొఱఁతదీర్చి సార్థక జన్ములైరి.

సీ. ఇదియె జీవితమునఁదుది నిముసంబని
తోఁచె విస్మృతి కొంత తొంగి చూచెఁ
బ్రచలి తోర్ధ్వశ్వాస పరుగులు వారె,న
య్యెడనున "రమణమహర్షి" తల్లి
నేకాగ్రదృష్టి లక్షించి దక్షిణహస్త
ముసుమాతృ హృదయమందునిచి వామ
కరము శిరమ్ముపై నొరయింప నంతఃప్ర
వృత్తులుఁగడుఁ బ్రకోపింపఁదొడఁగె

గీ. వాసన లడంగెఁ బ్రోన్నత స్వాను భవము
జూఱఁగొని హాయి కెంకి తానై రహించె
"నళగమాంబ" మహర్షి దివ్యాత్మ శక్తి
విమల విద్యుత్ప్రసారమై వెలుఁగుఁజూప.

(శ్రీ రమణాభ్యుదయము)





సరసకవిశేఖర

## శ్రీ బేవినహళ్లి కరణము కృష్ణరావు

జన్మస్థలము:—బేవినహళ్ళి.హిందూపురం తా॥ అనంతపురము జిల్లా

జన్మించిన తేది:— 21–9–1894

తల్లి:— శ్రీమతి నరసమాంబా,

తండ్రి:— శ్రీనరసింగరావు

మతము—కులము: హిందూ, శాంకరమతము—బ్రాహ్మణ.
బడగనాడు.

విద్యాభ్యాసము:

వీధిబడిలో రెండవ తరగతి మాత్రము జదివిరి. నాల్గవ తరగతిలో ఏడుమాసములుండి, పరీక్షా కాలమునకు విషమశీత జ్వరముతో హాజరు కాలేకపోయి యంతకే చదువు ఆపివేసిరి.

కుటుంబచరిత్ర:

వీరిది సామాన్యకుటుంబము. క్రమాగతముగావచ్చిన గ్రామ కరణీకము వీరి ముఖ్యవృత్తి. వీరి తల్లిదండ్రులకు ఎనిమిది మంది సంతానము. కవిగారు కడపటివారు. ప్రస్తుతము పోయిన వారు పోగా కవిగారికి యిద్దరన్నగారు, యిద్దరప్పగారు కలరు. 1915 సం॥ నుండి గ్రామ కరణీకపదవిని చేబట్టిరి. అప్పుడు వారు తెనుగు, గన్నడ గ్రంథములను జదువుచు, పద్యములను వ్రాయుటలో నేర్పును సంపాదించిరి.

వీరికి ప్రస్తుతము యిరువురు కుమారులు, యిద్దరు కుమార్తెలు కలరు. వీరికి స్వంత వ్యవసాయముకలదు.

సాహిత్యపరిచయము:

1921 లో కవిత్వము జెప్పమొదలిడి 'లోకబాంధవ శతకము' వ్రాసిరి. ఇది వారి తొలికృతి. డిగ్రీల చదువులెరుగని వీరు సరస్వతీ ప్రసన్నులైన సహజ ప్రతిభులు. మేడిపట్టి మెరకలు

చన్నిన చేతితోనే కలముపట్టి కవిత పండించిన నిరాడంబరులు. వీరి కవితావ్యవసాయము ఏబదేళ్ళ నిరంతర సాహిత్య సంపర్కముతో సుసంపన్నమైనది. హరికథారచనలతో ప్రారంభించిన వీరికవిత్వము అనతికాలంలోనే ధారాశుద్ధికలిగి, యతిప్రాసలకు గుంజాటనని సరళముగా సరసముగా పద్యములల్లు పాండిత్యము వీరికి దైవము కలిగించెను. వీరి అముద్రిత కృతులు పెక్కుకలవు. ప్రచురించి ప్రాచుర్యము పొందవలెననెడి ఆకాంక్షమదియందులేక, అజ్ఞాతముగా జీవనముగడిపిన జిజ్ఞాసులు వీరు. ఈ కవిగారి 'ధర్మసామ్రాజ్యము' ను బృహత్తర ప్రౌఢ ప్రబంధమును రచించి నలుపదియేళ్లపైబడి నను ముద్రించు ప్రయత్నమునకు వారు పూనలేదు.

వీరి ముద్రితకృతులునాలుగు. (1) ఏకలవ్యుని గురుభక్తిని ప్రబోధించు 'గురుదక్షిణ' (2) అభిమన్యుని వీరపరాక్రమమును తెలియజేయు 'తమ్మిమొగ్గరము' (3) గరుత్మంతునిగాథను తెలుపు 'విహగేంద్రవిజయము' (4) నవరసభరిత చతుర్థాంక నాటకము 'భీష్మ.'

అముద్రితములు:—

(1) లోకబాంధవశతకము (2) ధర్మవిజయము (సామ్రాజ్యము) (3) విక్రమవిజయము (4) త్రిశతి (5) భార్గవీ శతకము (6) సదుపదేశ శతకము (7) వేదాంత డిండిమము (8) సంధ్యార్థ విచారము (9) పూతనా సంహారము (హరికథ) (10) యమళార్జున భంజనము (11) కాళియ మర్దనము (12) పారిజాతాపహరణము (13) సుందోపసుంద (14) రస్నవ స్వప్నయాత్రె — గద్యము. (15) ఆదిశంకర భగవత్పాదుల చరిత్రము.

## కావ్యపరిచయము.

గురుదక్షిణ కవిగారి తొలిముద్రితకృతి. దీనిని వీరు 1923లో ప్రచురించిరి. చక్కటి ఆటవెలదులతో కూర్చిన కృతియిది. ఇందు ఏకలవ్యుడు తనగురువునెట్లు ఆరాధించెనో చూడుడు.

మట్టిచేత ద్రోణు నట్టిబొమ్మను జేసి
కేలునందు ధనువు గీలుగొలిపి
వస్త్రమాల్యములను వఱలశోభితుఁజేసె
భక్తిఁదానుశిష్యపదముఁదాల్చె.

అతఁడె తండ్రియంచు నాచార్యుఁడంచును
దైవమంచు దాతతాతయంచుఁ
బ్రాణసఖుడటంచుఁ బ్రాపంచు శుశ్రూషఁ
జిత్తశుద్ధిఁగలిగి చేయుచుండి.

గురుని ముందు తాను కోదండమునుబూని
బాణమొండుఁగూర్చి పైనబోవు
పక్షిగములనేయు; బడకున్నబొమ్మకుఁ
జుట్టుఁదిరిగిమ్రొక్కి గొట్టుమంల.

తమ్మిమొగ్గరము (ప్ర — 1924) వీరి ద్వితీయ కుసుమము. ఇందు బాలవీరాభిమన్యుని పద్మవ్యూహచ్ఛేదనము చక్కగా చెప్పబడినది.

వీరాభిమన్యుని వీరవిహారమెట్లు రచించిరో చదివి, చవి చూడుడు.

ఆ. వె. మెఱుఁగు మెఱసినట్లుఁ గొఱవిఁ ద్రిప్పినరీతి
పరుల లక్ష్యమునకుఁ బట్టువడక
తనరథంబు మెఱయ సునిశిత విశిఖముఁ
బఱపి మొగ్గరంబుఁ జెఱచివొచ్చె

కం॥ శరధిం దిరిగెడి మందర
గిరి యటు వనిసంచరించు కీలియుఁ బోలెన్
గిరిభేది పౌత్రుఁడత్తఱిఁ
గురుకుల సాగరముఁ జొచ్చి ఘూర్ణిలఁ జేసెన్

కం॥ ఎచ్చటఁ జూచిన నాతఁడె
విచ్చల విడిసంచరించి విమతుల మేనన్
గ్రుచ్చుచు తీవ్రాంబకముల
వ్రచ్చుచు పటుసుభట కోటి వఱలుచు నుండెన్.

వీరిమూడవ పుష్పము విహగేంద్రవిజయము. 1927లో దీనిని ప్రచురించిరి. తల్లి దాస్యమును బాపిన గరుత్మంతుని గాథయిది. భారతమున నాదిపర్వమున నున్న కథనుగైకొని కొంత పెంచి వ్రాసిరి. వినత తనకుమారుని యాశీర్వదించి, అమృత భాండమును దెచ్చుటకై పంపు సందర్భమున మాతృవాత్సల్యము నతి చక్కగా కవిగారు వ్రాసిరి.

ఉ. ఊఱకఁ బల్కి తార్క్ష్యుఁడిటులున్నత భక్తినమస్కరించి, తాఁ
గోరఁగ నానతిన్ వినత గొబ్బున నక్కునజేర్చి, యింపుసొం
పారు సుధామయోక్తులను హస్తతలంబున మౌళిదువ్వుచుం
గోరి వచించెఁ బుత్రుప యుఁ గూర్మిబయల్పడ సమ్మదంబునన్.

చ. తలఁకని చిత్తవృత్తిసురధామముఁజేరి యరాతివర్గముం
దలకొని యాహవోర్వి బలదర్పసమున్నతిఁగెల్చి, యాసుధం
బలిమి గ్రహించి తెచ్చునెడఁ బంకజనేత్రుఁడదెందునీకునే
సిలుగులు లేక సత్కరుణ శ్రీ విజయంబులు గూర్చిగావుతన్.

చ. వలగొని మ్రొక్కి యవ్విహగవల్లభుఁడిట్లనుఁదల్లిఁ గూర్చి,నే
బలపరిపంథితోడసుధ బల్మి గ్రహించెదులావు గల్గఁగా,
వలసినభోజనం బిడుము; వామవిలోచన! క్షుత్పిపాసలం,దొలం
చి, విరోధులంగడిమి దూఁటి జయంబునుఁగాంచి వచ్చెదన్.

నాల్గవది వీరి భీష్మనాటకము. (ప్ర—1973)

భీష్మ నాటకమున సంభాషణములు గద్యపద్యాత్మకములై సులభ గ్రాంధిక భాషలో నుండుటచే సంగీత సాహిత్యములకు వియ్య మేర్పడినది. తేటతెలుగు పదములతో చిన్నచిన్న వాక్యములలో నీ కవి పద్యములు తిక్కన్నగారి సంభాషణాశైలిని పుణికి పుచ్చుకొన్నటుల నుండుటచే నాటకోచితములైనవి. ముఖ్యముగా ఉపాలంభనములు, వాదోపవాదములు, వీరాలాపములు మొదలగు భావముల ప్రకటనమున వీరి లోకోక్తులతోపలుకుబడులతో నిండిన శైలి చక్కగ రాణించినది.సరళశైలికి తగినట్లుటనట స్పష్టములగు నలంకారములు కుదిరినవి.

**కర్ణుని నమ్మియుద్ధమునకుదిగిన దుర్యోధనునకు భీష్మాచార్యులెట్లుపదేశము గావించిరో జూడుడు.**

**దుర్యో:— పితామహా! యేటిమాటలు? ఈ యుద్ధమున జయము మనకే లభ్యమగును.**

గీ. కెఱలి భీష్మాగ్ని మునుముందు పఱవ, వెనుకఁ
ఘటజ కర్ణాది యోధులన్ గాలివీవఁ
బాండు సుతులను నెండిన వనము గినము
మాడి మసికాదె యొ-. త్రుటి మాత్రిలోనఁ.

పాండవులను గూల్పనొక్క కర్ణుండెచాలును.

భీష్మ:— దుర్యోధనా ఎంతపసివాఁడవై తివి?

సీ. గురునాజ్ఞ ద్రుపదుని గొనితేరఁజను వేళఁ
దెగివెంటరాఁడె యీ మగలమగఁడు?
తిమియంత్రి ఛేదనోద్యమము నిర్వర్తింప
నజ్జాసరాఁడె ఈ వెజ్జితఱటు?
గంధర్వపతినిన్ను బంధించి నప్పుడు
తలనమ్మ కొానెనె రాధాసుతుండు?
పట్టిన పసిఁదలపాగయుఁద్రిగిడికిఁ
గోలిచ్చిరాఁడె ఈ బాలిశుండు?

గీ. క్రొత్తలేముండె వెనుకటి పొత్తెరాక?
కలదు వారికిఁ గృష్ణునిబల మతండు
చురిక గొనకున్న — రణమూడి సఱక
గన్ను దెఱచిన లోకమ్ము కాలికూలు.

అదియునుంగాక నీ ప్రాణమిత్రులతోఁజేరి మీరు వారి కొనర్చిన యెగ్గులెన్నిలేవు? వానికి ఫలితములు మీరు భావించినటు నెఱవేరెనా?

చ॥ సలుపురుమంతనంబుఁగొని నాలిపనుల్ దెగియెన్ని యేనియున్
జలిపితి; రేయొకండయిన సంకటపెట్టెనెహారి? దానికిన్
గలబలమొక్క-ధర్మ; మదికన్గొనుఁ గృష్ణనిరూప; మాతడే
కలిగిన వారివంకఁ ద్రిజగంబులు జూడఁగనోప వేపునన్.

శకుని సాయంబున జూదమున గెల్చితిననియు, నట్లే కర్ణు సాయమున యుద్ధమునగూడ వారి నిర్జింతుననియు, సుయోధనుడు గర్వించెను. పాండవులు కృష్ణుడను వజ్రకవచమును ధరించిరి. అది అభేద్యము

పేరు ప్రతిష్ఠలను ఆశించుటగాని అన్వేషించుటగాని యెరుగని ఈ వృద్ధకవిని (80 ఏండ్లు) ఆంధ్రభాషాభిమానులందరు ఆదరించి కృతికర్తకు సారస్వతప్రపంచమున సముచితస్థానము నందించ గలరని మా ఆకాంక్ష.





కవితావసంత—కవిసింహ—అవధాని

పంచానన—శివభారతకర్త—మహాకవి

## శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రి

జననము: 7–4–1894

జన్మస్థలము: కడపజిల్లా—జమ్మలమడుగు తాలూకా—నెమళ్లదిన్నె గ్రామము.

తల్లి:— శ్రీమతి నరసమాంబ

తండ్రి:— శ్రీరామయ్య

మతము, కులము:— హిందూ—బ్రాహ్మణ

విద్యాభ్యాసము:

కవిగారు తమ పదమూడవయేటనే ప్రొద్దుటూరుచేరి అక్కడి బ్రహ్మ శ్రీ రూపావతారము శేషశాస్త్రుల వారివద్ద కావ్యనాటకార లంకార సాహిత్యమును, తర్క వ్యాకరణ శాస్త్రములను అభ్య సించిరి. శ్రీ షడ్దర్శనము వాసుదేవావధానులవారివద్ద జాతక, ముహూర్తవాస్తు శాస్త్రముల నభ్యయనముచేసిరి. జ్యోతిశ్శాస్త్ర మున స్వయముగా వ్యాసంగము చేసిరి.

ఉద్యోగము—పదవులు:—

1930 లో ప్రొద్దుటూరునందలి శ్రీకన్యకాపరమేశ్వరి సంస్కృత పాఠశాలలో అధ్యాపకులుగా చేరిరి. ఆ సమయమున "బ్రహ్మనందినీ" అను పత్రికకు సంపాదకత్వమును వహించిరి. తరువాత ప్రొద్దుటూరునందలి పురపాలకోన్నత పాఠశాలలో పెక్కేండ్లు ప్రధానాంధ్రోపాధ్యాయులుగ పనిచేసి పదవీ విరమణ పొందిరి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సంస్థకు వీరు సామాన్య సభ్యులుగాచేరి ఉపాధ్యక్షులై విశిష్టసభ్యులుగా గౌరవింపబడిరి. ఆంధ్ర ప్రభుత్వము వారిని శాసనమండలి సభ్యులుగ ఎన్నుకొని, గౌరవించినది. 80 ఏండ్లకు పైబడిన వృద్ధాప్యమునందు సహితము వీరు సాహిత్య రచనా వ్యాసంగము వదలలేదు. ప్రస్తుతము వారు వాల్మీకి రామాయణమును ఏడువేల పద్యములందు తెనుగించి అచ్చునకు సిద్ధపరచిరి.

## సాహిత్య సేవ:—

శ్రీ దుర్భాకరాజశేఖర శతావధానితోకలిసి వీరు 'రాజశేఖర వేంకటేశకవులు'ను జంటకవులపేర అష్టావధానములను పలుచోట్ల గావించిరి. విశేష సన్మానములనందిరి. వీరి అవధాన జైత్రయాత్రా విశేషములన్నియు 'అవధానసారమను' గ్రంథమున విపులముగా చెప్పబడినది. బాల్యమునందు వీరు 'శరన్నవరాత్రపద్యావళి 'ని తెనిగించిరి. తరువాతి కావ్యమే వీరి 'శివభారతము'

శ్రీ శాస్త్రిగారి ముద్రితకృతులు

(1) శరన్నవరాత్రపద్యావళి (2) అష్టావధాన సారము (3)శ్రీ ఛత్రపతిశివాజీ (4) విశ్వనాథనాయకుడు (5) శివభారతము (6) శ్రీనాథునికవితా విమర్శనము (7) గోవర్ధన సప్తశతి (8) రఘునాథీయము.

అముద్రితములు :— (1) ఉత్తర రామాయణ కావ్యశిల్పము (విమర్శనము) (2)రామాయణము— పద్యకావ్యము.

### కావ్యపరిచయము

శివభారతరచనకు పూర్వమీకవిగారినిగూర్చి, వీరి కవిత్వమును గూర్చి తామెఱుఁగక పోఁయిన విస్మయమునుగొంవలు పెద్దలు ప్రకటించుట యప్పటిలో జరిగినది. రాయలసీమ ఖనినుండి వెలువడిన రత్నములన్నియూ సానబెట్టిన తరువాతనే జాతిరత్నములుగా, దేదీప్యమానములై ప్రకాశించి పేరెన్నికగన్నవి. ఈ గ్రంథరచనా కాలమున కవిగారు చేసినదొక కవితాతపస్సు. ఆ ఫలితమే శివభారతావతరణ. అది తెనుగువారల కడుపులు నిండించు రాయలసీమ పంట.

"శివభారత మొక సుందర కళాసృష్టి. ఆంధ్రభారతి ముంజేతి చిలుక ముద్దులమూటగట్టు తెలుగుపలుకులను ముదిపముతో ముచ్చటి స్తున్నది. ఆమెముఖము నిగమసూక్తుల గానముచేస్తూ ధర్మోపన్యా సము కావిస్తున్నది. ఆమెచేతియందలి అక్షరమాల భారతధర్మమనన ధ్యానాదుల జేయవలెనవి భారతీయుల నుద్బోధిస్తున్నది. ఆమె యొయ్యారముగా గ్రహించిన వీణనుండి మంద్ర, మధ్యమ, తార భేదములతో 'సరిగమపదనిస' స్వరములు భావపూరితములై బయలు వెడలుతూ లోకమును సమ్మోహితము జేస్తున్నది. ఆమె మరియొక చేతియందు ధరించిన ఆపుస్తకమే 'శ్రీ శివభారతము' .........

పై పలుకులు శ్రీడాక్టర్ చిలుకూరి నారాయణరావు M.A.L.T.,Ph D. గారివి. వారు వ్రాసిన వాక్కులందతిశయోక్తులు లేవు. అవిస్తుతి వాక్యములుకావు. ముఖస్తుతిచేయు నగత్యమువారికిలేదు. వీరి పద్య రచన ఒకతేనెకాలువ. వీరికవిత బంగరు తీగవలెసాగినది.

భారతదేశమున సనాతన ధర్మపునరుద్ధరణకై కంకణము కట్టిన మహావీరుడు శివాజీ. మొగలుల నెదిర్చి హైందవ ధర్మపతాకము నెగురవేసిన వీరకేసరి ఈ కావ్యకథానాయకుడు. అష్టమూర్తి భక్తుడు శివాజీ. కావుననే యీ ప్రబంధము ఎనిమిదాశ్వాసములు గలిగి యున్నది శ్రీ శివభారత మీనాటి కవితోద్యానమునకు నవ్య వసంతా గమనము. శివాజీ నిజముగా హిందూ ధర్మమును నిలుపుటకు దాని విశిష్టతను చాటుటకు, యవనరాజ్య నిర్మూలనకు అవతరించిన శివుడే. కాకున్న యిట్టి ఘనకార్య మితరులచేతకాదు.

చం. శివునవతారమేయని వచింపఁగనొప్పు శివాజి, ప్రాగ్భవో
ద్భవమగు భక్తిసంపదయుఁ,దల్లియొసంగు మతాభిమానమున్
బువు వెదలించు తావివలెఁ బొంగిన సాహస ధైర్యశౌర్యగా
రవము లెలర్పఁగాఁజిఋత ప్రాయపు టాటల మేలిమిఁగనెఁ

చిఱుత ప్రాయమునుండియే, తల్లి యిచ్చిన మతాభిమానము తోను, ఆమె చెప్పిన పురాణకథలతోను, శివాజీ సాహసము పొంగి నది. ఒకనాడుతల్లి యాతనికి చిన్ననాటజరిగిన యొకసంఘటన నిట్లు జెప్పినది.

మ॥ అయిదాఱేఁడులవాఁడవీ వెఱుఁగ,వన్నా! మొన్న మోగల్ చమూ
చయముల్ గత్తిఁగటారి మూసి కసిమించన్ డాసి, మీయయ్యనే
బయలన్ నిల్వఁగనీకతోలె, నటుపైఁ బంతంబు సాధింపనా
పయికిన్ దూఁకె, నిఁకేమి వల్కుదుఁ? దలంపన్ మేనుగంపిం
చెడిన్.

సీ. ఉదరమ్మునంటనిన్ బొదివి, మర్కటివోలెఁ
బ్రతిదుర్గమున కెగఁబ్రాకలేక,
బావురు గానియాపదఁబాప, రాచిల్క
వలెఁబంజరమున విన్నిలుపలేక,
కంసు కటారినోఁకఁగనీక, వసుదేవు
వలె గోకులముఁ జేర్చువాఁడులేక,
పులివాతఁబడుగోవువలె, లేఁగదరిఁజేరి
దిక్కులేనితనంబు దెలుపలేక,

తే॥ యలసిపోయితిఁ; 'దోడు నైతి' ననుచుఁ
గుమిలిపోయితి; మొగలు కక్కటితి నెదిరి
ధిక్కరించితి; నీతికై తెంపునేయ
నొకఁడు లేఁడయ్యెనే' యంచు నుడికిపోతి.

దానితో శివాజీ యుద్రేకము మఱింత మించినది. తల్లి యిట్లు వీరరసమును నూరిపోసినది. తరువాత శివాజీకి రామదాసు దర్శన

భాగ్యమబ్బినది. అతడు హైందవమతమును, హైందవ భూమిని రక్షించు భారమును పూర్తిగా శివాజీపై మోపెను. అతడిట్లు ధర్మోప దేశమును గావించెను.

ఉ॥ కాపరిలేని గోగణము కైవడి హైందవభూమి ధర్మర
క్షాపరులైన క్షత్రియులఁ గానక, ముష్కరతస్కరాళిచే
నేపఱి, నీపయిన్ బరువులెత్తెడు నాసలవేచియుండె; బా
హాపరిణాహ! ధూర్వహుఁడవై శివరాజ! భరింపుమీ ధరన్!

చ॥ 'మునకలువెట్టు దేశమతముల్ దరిఁజేర్పఁగ ధీరుఁడెవ్వఁడా'
యని నిసుఁగంటిఁ, గంటి భవదాశయ; మీనినుఁ బ్రోత్స
హింపఁగాఁ
బనిగొని ధర్మగీతములు వ్రాసితి; నా తలఁపున్ వచించి నె
మ్మనమున నూఱడిల్లితిఁ; గుమార! సమీహిత మీవ చూడుమీ।

రామదాసు వచనామృతమును మనసారఁ గ్రోలిన శివాజీ తనువు నిలువెల్ల పొంగినది. నాటినుండియు కాషాయ పతాకమెత్తి 'భగవాజండా' ను ప్రతిష్ఠించెను. కవిగారు పోషించిన వీరరసమునకీ పద్యమొక మచ్చుతునక.

సీ॥ కొఱవిఁ ద్రిప్పినయట్లు మెఱుఁగులేచినయట్లు
కరవాలు మిసమిసల్ గ్రమ్ముకొనఁగ.
మునుమెత్తి రిపుమధ్యమును జీల్చి చొఁచ్చాటి
నలువైపు సేనలు నఱకులాడి—
పెనుగాలి తాటిపంగ్లనురాల్చు చందానఁ
గొకవంగ్లఁ బైరులు గోసినట్లు,
చెఱుకు గడల్ నిల్వునటికి వైచెడుకీతిఁ,
జిగురాకు దూసిపోసిన విధానఁ

తే॥ దలలు పేర్వులు పాణి పాదములుకండ
లింతలింతలు తునియలై, యిందునందుఁ
బ్రోవులై, రాసులై, రణభూమిమిత్తి
వంటయిల్లనఁ బీనుఁగు పెంటచేసె॥

ఇట్లీకావ్యము హైందవ మతసంరక్షణార్థమై వెలయుటయు, అందు వీరరసము నత్యున్నతముగా పోషించుటయు, నేటిచదువరులకు దేశభక్తి ప్రబోధాత్మకముగా నుండుటయు, పిఱికిపందలకు సహితము వీరావేశమును గల్గించుటయు మనయదృష్టము. ఎన్నదగిన వీరిరెండవకృతి శ్రీ రఘునాధీయము. ఇదికూడా చారిత్రాత్మిక ప్రబంధమే. శ్రీ రఘునాథ నాయకునిగూర్చి తెలుగువారికే తగినంత తెలియదు. ఆతని వీరశృంగారముల చొఱవ, ఉదాత్తహృదయము, సంగీత సాహిత్యముల మీది పాండిత్యాభిమానములు, అందుల కాతని కైంకర్యము,—ఇత్యాది విషయములమీద తెలుగు కోవిదులుచేసిన పరిశీలన చాలామితము; అదియు అందునందు వికీర్ణము. ఎంతో శ్రమతో ఓర్పుతో ఆప్రాత—క్రొత్త చరిత్రలోని చిన్న-పెద్ద వివరములను సప్రమాణముగా సంపాదించి, సమకూర్చుకొని, శాస్త్రిగారు ఈ కావ్యము సంతరించినారు. రఘునాథుని ' ఉభయనాంచారుల ' తోడి ప్రణయలీలలు ఇందు ఉదాత్తమధురముగా చిత్రితమైనవి. కాని ఒట్టుమీద ఈ కావ్యముగూడ తొంబదిపాళ్లు వివిధ వీరరసవీచీ విహారములతోనే మఱవకు అని తొఱకుచున్నది. (శ్రీ రాళ్ళపల్లి)

రఘునాధుడు తన ప్రియురాంద్రతోగలసి యిట్లు వనకేళి జలకేళీ విహారములను గావించెనని కవిగారు వ్రాసియున్నారు.

మ॥ 'ద్రవిళ స్త్రీకుచకంచుకావరణముం దప్పించి వాతార్భకుం
డవరోధంబు తొలంచెనో, తమకుఁదామై విప్పిరోకాక, యాం
ధ్రవధూగర్వము చేతఁజిక్కె నిదె సర్వంబౌర కావేరి గౌ
రవ' మంచాడు విభుం గళావతికుచాగ్రంబొత్తెఁగౌఁగిటిలో

సీ॥ మొగమించుకంత నిక్కఁగఁజేసియాతాడఁ
జంద్రబింబములు సాక్షాత్కరించెఁ,
బిరుదలపైకిఁబొంపిరివోవ నీదుచో
నిసుకతిన్నెలఠీవు లేపుసూపె.
నీలకేశాళిగన్పింప నీఁతాడుచో
శైవాలజాల సంచయము లుబ్బె,
బిగి గబ్బిగుబ్బలుబ్బగ నీదులాడుచో
జక్కవ కవయొప్పు సవదరించె,

గీ॥ అన్ని సొబగుల రఘునాథుఁడవధరించి
పెరిమపెంపున నుబ్బితబ్బిబ్బు చెందఁ
జెంచులక్ష్మికళావతి స్నిగ్ధమూర్తు
లెనసి యీఁతాడ, దివి-భువి యేకమయ్యె

కవి గారు కడురమ్యముగా ద్రవిడాంగనా సొబగును విప్పి జూపిరి. జవ్వనుల జలకేళీ విహారమును కనులకుగట్టినట్లు తీర్చిరి. రఘునాథుని వనకేళి, జలకేళీ విహారములందే 'కావేరి' నదినిగూర్చి యాప్రాంతమునబండు చెఱకు,వరి,మామిడి, నారికేళ ఫలవృక్షముల గూర్చి, ధాన్యరాశుల వైభవమునుగూర్చి చక్కగా పోల్చిచెప్పిరి.

ఈ కావ్యమురెండు వేలకుపైగా పద్యములతోనిండివున్నది. శివభారతము తరువాత అంతటి మహత్తరకావ్యమిక తనకవిత్వమున వెలువడదేమోనని సంశయించిన కవిగారు ముప్పదియేండ్లతరువాత మరల తమ కవితావిపంచిని పలికించి, ఇంతకాలమెదురు చూచుచు వేచియున్న తెలుగువారి హృదయముల కుల్లాసము గలిగించిన దీరఘునాథీయము. రాయలసీమలో వెలిసిన కావ్యగుచ్ఛముల యందిది మేల్బంతి.

గోవర్ధనసప్తశతి: ఆంధ్రానువాదము చేయబడినది. దీనిని సంస్కృతమున శ్రీ గోవర్ధనాచార్యులవారు 'ఆర్యాసప్తశతి' యనుపేర వ్రాసిరి. ఇందు దాదాపు 8 వందల పద్యములు మూలముతో వున్నవి. ఏ శ్లోకమున కాపద్యమేకాని, కథానుబంధములేదు. పద్యములన్నియు శృంగార పూరితములై శోభిల్లుచున్నవి. 11వ శతాబ్దిలో వెలసిన ఈ మూలగ్రంథమునకు సరియైన యనువాద మిప్పుడు వెలుగులోనికి వచ్చుట మనయదృష్టము.

రాయలసీమలో మరొక రామాయణ కావ్యము ఈ కవిగారి కలమునుండి వెలువడుచుండుట మన భాగ్యము. ఇది వాల్మీకికవి హృదయమునకు ప్రతిచ్ఛాయేకాని, పూర్తి అనువాదముకాని, అనుసరణముగాని కానేకాదు.

ఈ యముద్రిత శ్రీరామాయణకావ్యమందలి సుందర కాండమునందు ప్రథమ పర్యాయముగ సీత రావణునితోనిట్లను చున్నది.

ఉ॥ అతఁడు ధర్మమూర్తి, శరణాగతవత్సలుఁ, డూరకే యని
ర్హేతుక వైరమెంచఁ; డిదియిట్టిదిగానఁ, గృతజ్ఞతాప్రతి
ద్యోతితమైన నీదుహృదయోన్నతి నాతఁడుమెచ్చు;మృత్యుసం
ఘాతముఁ బాపికోఁదలపు గల్గినచో నిదియుక్తమైతగున్॥

చ॥ కనలుచు, నింద్రహస్త పరికల్పిత వజ్రమునట్లు నెల్లెడన్
ముసుగుచు, రామలక్ష్మణులు ఘూర్ణితబాణము లీపురంబున
న్మొసలఁ బరాక్రమించి, యహిపుంజములన్ గరుడుంతు వోలె, మి
మ్మని మొనఁజీల్చివేయఁగల;వంత యు సత్యము దానవేశ్వరా!

ఎనుబదిరెండేండ్లవయస్సున వీరీ రామాయణకావ్యమును వ్రాయుట పుణ్యమునకు, పురుషార్థమునకు దగియున్నది. దీనిని త్వరలోనే ముద్రించు ప్రయత్నమునను న్నారు. వారి సంకల్పమనతి కాలముననే ఫలించుగాక!

ఈ 'మహాకవి'గా రిటీవల జరిగిన ప్రపంచ తెలుగు మహా సభలయందు సన్మానితులగుట రాయలసీమకే ఒకయలంకారము. వీరిట్టి సన్మానములెన్నియో పొందదగినవారు.

రాయలసీమ రత్నాలలో వీరు మాణిక్యమువంటివారు. వీరి కృషి ఆ చంద్ర తారార్కముగా విలసిల్లు గాక!



(మొదటి భాగము సంపూర్ణము.)

# శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల-హిందూపురం.

## వారి ప్రచురణలు



1. స్వార్థత్యాగము—నవల—శ్రీ ఘూళీ కృష్ణమూర్తి
2. భావతరంగములు—ఖండికలు—శ్రీ కల్లూరు అహోబలరావు
3. ప్రేమసుందరి భా I—నవల—శ్రీ హెచ్. దేవదానము
4. ప్రేమసుందరి భా II— ,, ,, —
5. వేమభూపాల విజయము—శ్రీ రావాడ వేంకటరామశాస్త్రులు
6. విప్రనారాయణ నాటకము—శ్రీ రూపనగుడి నారాయణరావు
7. మాధవాశ్రమము భా I—నవల—శ్రీగుంటి సుబ్రహ్మణ్యశర్మ
8. మాధవాశ్రమము భా II— ,, — ,,
9. కుముదవల్లి—నాటకము—శ్రీశీరిపి ఆంజనేయులు
10. పూదోట—పద్యఖండికలు—శ్రీకల్లూరు అహోబలరావు
11. రాయలసీమ రత్నరాశి—కవితాసంకలనము— ,, —
12. స్వప్నవల్లభుడు—పద్యకావ్యము—,, హెచ్. దేవదానము
13. జ్ఞానవాశిష్ఠ రత్నములు—పద్యములు—,, కిరికెర భీమరావు
14. భక్తమందారము—ద్విశతి పద్యములు—,, కల్లూరివారు
15. అమృతాభిషేకము—ఖండికలు—,, బెళ్లూరి శ్రీనివాసమూర్తి

16. షాజహాన్—పద్యకావ్యము—,, కల్లూరువేంకటనారాయణరావు

*17. తపోవనము—పద్యఖండికలు—,, బెళ్లూరి శ్రీనివాసమూర్తి

*18. మయూరపరిహాసనము—హాస్యము—,. డి. బాబన్న

*19. భక్తపోతరాజీయము—నాటకము—,, మద్దులపల్లివారు

*20. వివేకానందము—ద్విపదకావ్యము-,, బెల్లూరిశ్రీనివాసమూర్తి

*21. ఉగాది స్వర్ణధారతి—పద్యసంపుటి—,, కల్లూరివారు

*22 రాయలసీమ రచయితల చరిత్ర—౧

* ఈగుర్తుగల పుస్తకములు మాత్రము లభించగలవు.

1 నుండి 9 వరకుగల పుస్తకములు బళ్లారి పట్టణమునందును. 10 నుండి 12 వరకు గలవి అనంతపురము నందును, 13 నుండి 22 వరకు హిందూపురము నందును, ప్రచురింప బడినవి.

రాయలసీమ, ముఖ్య పట్టణములనుండి, పై పుస్తకముల నమ్ముటకు ఏజెంట్లు కావలయును. ధారాళమైన, కమిషను ఇవ్వబడును. గ్రంథాలయాధికారులు, కాలేజి, హైస్కూళ్ల ప్రధానోపాధ్యాయులు. పంఛాయతీ ప్రెసిడెంట్లు, మా పుస్తకములను కొని, ప్రోత్సహింప మనవి. వివరములకు గ్రంథమాల సెక్రిటరీ గారికి వ్రాయుడు.



## మా రాబోవు పుస్తకాలు

1. రాయలసీమ రచయితల చరిత్ర—౨

రాయలసీమ యందలి పద్య-గద్య-గేయ-నవల-కథారచయిత (త్రు)లు తమ వివరములను పంపి మా కృషికి సహకరించవలసినదిగా విజ్ఞప్తి. వివరములకు వ్రాయండి.

2. శ్రీ రామ కర్ణామృతము
3. శ్రీ కృష్ణ కర్ణామృతము
— ఆంధ్రానువాదము

సంస్కృత శ్లోకములకు చక్కని పద్యరత్నములు

రచయిత: శ్రీకల్లూరు అహోబలరావు

4. దేవుడికి నేతి దీపాలు

పసందైన పన్నెండు కథల సంపుటి

రచయిత: శ్రీపసగరం పార్థసారధి

గ్రంథాలయాధికారులు—పుస్తక విక్రేతలు మాతో సంప్రదించండి.

ఇట్లు

మేనేజింగ్ ఎడిటర్

శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల—హిందూపురం.